# చందమామ

ఈ సంచికలో కథలు
వింతలు - విశేషాలు

★



ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో
ఆకర్షణలు.



# నేడే చూడండి

విజయా వారి

# సి.ఐ.డి.

డైరెక్షన్... చాణక్య

నిర్మాతలు... నాగిరెడ్డి · చక్రపాణి



# అమ్మా, అమ్మా, ఇంకొక్కటి

పిల్లలకు పెద్దలకుకూడా పుష్టికరము రుచికరము అగు ప్యారీ మిఠాయిలు అనివార్యము. మీరుకూడా ప్యారీ మిఠాయిలను ఎక్కువగా ఆస్వాదిస్తారు. విడిగానో లేక అందంగానో అచ్చువేసిన ఫ్యాన్సీ డబ్బాలలోనో కొనండి. అందరికి ఇవ్వండి. ప్యారీ మిఠాయిలతో జీవితం వినోదంగాను, విలాసంగాను గడిచిపోతుంది.




విశిష్టరకపు మిఠాయిలు తయారుచేయువారు

వీటిని వాడారా : లెమన్ బార్లీ కోకోనట్స్
—మిల్క్ టాఫీ—జింజర్ క్యాప్స్—సూపర్ బట్టర్ స్కాచ్

ప్యారీస్ కన్ఫెక్షనరీ లిమిటెడ్, మద్రాసు

JWT/PRS/3279



# చందమామ

సంచాలకుడు: 'చక్రపాణి'

"నెహ్రూకథ" మన జాతీయ స్వాతంత్ర్య పోరాటం కథతో ఎలా కలిసి నడుస్తున్నదీ "చందమామ" పాఠకులు గమనించే ఉంటారు. ఆనాడు నడిచిన పోరాటాలలో ప్రజాబాహుళ్యం పాల్గొన్న కారణంగానే ఈనాడు మనం స్వాతంత్ర్యం అనుభవిస్తున్నాం.

ఈ స్వాతంత్ర్యంతో బాటు మన దేశప్రజలకు దేశాన్ని శత్రువుల నుంచి కాపాడుకోవలసిన బాధ్యత కూడా ఏర్పడింది. ప్రభుత్వం యుద్ధ యత్నాలు చేస్తుంది. సైన్యాలు యుద్ధం చేస్తాయి. కాని సామాన్య పౌరులు కూడా విజయానికి అనేక విధాల తోడ్పడాలి. "వృద్ధభిక్షువు" అన్న కథలో సాధారణ పౌరుడైన పరోపకారి పాపన్న శత్రు గూఢచారులను పట్టుకుని విజయానికి అపారంగా తోడ్పడతాడు.

సంపుటి: 37 - డిసెంబర్ 1965 - సంచిక: 6

CHITRA



# భారత చరిత్ర




ఔరంగజేబు దీక్షగల సున్నీ ముసల్మాను. ఆయన పరిపాలనను మతం నుంచి వేరుగా ఉంచక, కురాను సిద్ధాంతాల ప్రకారం పాలన సాగించాడు. వేడుకలూ, నృత్య గానాలూ నిషేధించాడు. ఆయనను "సింహాసన మెక్కిన సన్యాసి" అన్నారు. 1679లో మతాంతరుల పై జిజియా పన్ను పునరుద్ధరించాడు. ఆయన మతాన్నీ, పరిపాలననూ ఏకం చెయ్యటం పొరపాటు.

ఔరంగజేబు ప్రవేశపెట్టిన కొత్త విధానాలపై మొట్టమొదటగా తిరుగుబాటు చేసిన వారు మథురకు చెందిన జాట్‌లు. గోక్లా అనే జమీందారు నాయకత్వం కింద వారు 1669 లో ఒక పితూరీ చేసి, ఫౌజ్‌దారైన అబ్దున్ నబీ అనే వాణ్ణి చంపేసి, వాడి దౌష్ట్యం నుంచి ఒక ఏడాదిపాటు విముక్తి పొందారు. తరవాత హసన్ అలీ ఖాన్ అనే వాడు సేనతో సహా కొత్త ఫౌజ్‌దారుగా వచ్చి, గోక్లాను చంపి, అతని కుటుంబం వారికి ఇస్లామ్ మత మిప్పించాడు. 1685 లో రాజారామ్ నాయకత్వం కింద జాట్‌లు తిరిగి విజృంభించారు. 1688 లో వారు సికంద్రా వద్ద గల అక్బరు సమాధిని కొల్లగొట్టారు. రాజారామ్ చంపబడ్డాడు, ఈ తిరుగుబాటు కూడా అణచబడింది.

ఔరంగజేబు పై రెండవ తిరుగుబాటు చేసినవాడు ఛత్రసాల్ అనే బుందేలా రాజు. ఛత్రసాల్ తండ్రి చంపత్‌రాయ్ కూడా ఔరంగజేబు పై తొలిరోజులలో తిరగబడ్డాడు గాని, తాను చక్రవర్తికి బందీగా చిక్కే ప్రమాదం ఏర్పడే సరికి ఆత్మహత్య చేసుకున్నాడు. శివాజీని చూసి ఛత్రసాల్ తన మతం కోసమూ, బుందేలా స్వాతంత్ర్యం కోసమూ వీరోచితంగా పోరాడి, మొగలుల పై అనేక విజయాలు సాధించాడు. బుందేల్‌ఖండ్, మాల్వాల లోని హిందువులు అతని

## 51. ఔరంగజేబు—తిరుగుబాట్లు

వెనక దృఢంగా నిలబడ్డారు. మాల్వా తూర్పు ప్రాంతంలో అతను స్వతంత్ర రాజ్యం ఏర్పరచుకుని, 1731 లో తాను మరణించిన దాకా ఏలాడు. అతని రాజధాని పన్నా.

ఔరంగజేబు మొదటిసారిగా సిక్కులను తనకు శత్రువులు చేసుకున్నాడు. 15, 16 శతాబ్దులలో దేశంలో మత పునరుద్ధరణో ద్యమం ప్రబలినప్పుడు గురునానక్ సిక్కు మతాన్ని స్థాపించాడు. నానక్ అనంతరం అంగద్, అమర్‌దాస్, రామదాసులు సిక్కు గురువు లయారు. అక్బరుకు రామదాసంటే అమిత భక్తి ఉండేది. అయన రామదాసుకు అమృతసర్ వద్ద కొంత భూమి ఇచ్చాడు. అక్కడ ఒక కొల నుండేది. దానిని పెద్దది చేసి, అక్కడ సుప్రసిద్ధమైన దేవాలయం నిర్మించారు.

అయిదవ సిక్కుగురు వైన అర్జన్‌మల్ (1581-1606) సిక్కు మతాన్ని బాగా వ్యాపింపజేసి, "ఆదిగ్రంథం" రచించాడు. ఇదే సిక్కుల తొలి మతగ్రంథం. అయన కాలంలో ధనం కూడా బాగా పోగయింది. వెనుకటి గురువుల లాగా కాక ఈయన రాజకీయాలలో ప్రవేశించి, ఖుస్రవ్‌ను బల పరిచాడు. ఆ కారణంగా జహంగీర్ ఈయ



నను రాజద్రోహిగా ప్రకటించి 1606 లో చంపించాడు. ఆయన కొడుకు హరగోవింద్ గురువై, సేనలను సమీకరించి, 1628 లో సంగ్రామ అనే చోట మొగలు సేనలపై విజయం కూడా సాధించాడు.

1668 లో, తేగ్ బహదుర్ అనే సిక్కు గురువు చక్రవర్తి పై కత్తికట్టి, కాశ్మీరు లోని బ్రాహ్మణులను రెచ్చగొట్టాడు. ఔరంగజేబు ఆయనను పట్టి ఢిల్లీకి తెప్పించి, "ఇస్లామ్ మతం పుచ్చుకుం టావా, తల ఇచ్చుకుంటావా?" అని అడి గాడు. తేగ్‌బహదుర్ తల ఇవ్వటానికే సిద్ధ పడ్డాడు. ఔరంగజేబు ఆయన తల తీయిం

చటంతో సిక్కులు మొగలుల పైన యుద్ధానికి తలపడ్డారు.

తేగ్‌బహదుర్ కొడుకు గురుగోవింద్ అపూర్వ భారతీయ వ్యక్తులలో ఒకడు. ఆయన సిక్కుల ఈనాటి ఆచారాలన్నీ తీర్చి దిద్ది, వారు శత్రువులకు వెన్ను చూపరాదన్న నియమం ఏర్పాటు చేశాడు, గొప్ప వీరుడు, మొగలులతో పోరాటాలు జరిపాడు.

మొగలు సామ్రాజ్యానికి ఎంతో సేవ చేసిన రాజపుత్రులను శత్రువులుగా చేసుకుని ఔరంగజేబు చాలా నష్టపడ్డాడు. ఆయన తొందరపడి, రాజా జయసింగ్ మరణానంతరం అంబరునూ, జస్వంత సింగు మరణానంతరం మార్వారునూ తన అధీనంలోకి తీసుకున్నాడు. దానితో రాజపుత్ర కుటుంబాలు రెచ్చిపోయాయి. మార్వారుకు చెందిన రాథోడ్‌లూ, మేవారుకు చెందిన సిసోదియాలూ ఏకమయారు. దుర్గాదాసు అనే అపూర్వ వ్యక్తి వారికి తోడయాడు. దుర్గాదాసు భీష్మద్రోణులను పోలిన వ్యక్తి. ఆయన ప్రభుభక్తీ, పరాక్రమమూ, యుద్ధ నీతీ అసమానమైనవి.

ఔరంగజేబు రాజపుత్రస్థానం మీదికి తన కొడుకుల వెంట సేనలను పంపాడు. చితోడ్ సులువుగా అధీనమయింది. అక్బరు రాజకుమారుడి కింద కొంత సేనను చితోడ్ వద్ద ఉంచి, ఔరంగజేబు మిగిలిన సేనతో అజ్మీరు పైకి వెళ్ళాడు. రాజపుత్రులు అక్బరు సేనల పై భయంకరమైన గొరిల్లా యుద్ధం సాగించి, మొగలు సేనను "స్తంభింప" జేశారు. ఈ అపజయానికి అక్బరు అసమర్ధతే కారణమని ఔరంగజేబు అతన్ని సేనా నాయకత్వం నుంచి తొలగించి అవమాన పరిచాడు. రాజపుత్రుల సహాయం యొక్క విలువ తెలిసిన అక్బరు 70 వేల రాజపుత్ర సేనతో తన తండ్రినే ఎదిరించ యత్నించాడు గాని, అతని అవివేకం వల్లనే ఆ ఎత్తు పారలేదు.



# నేహ్రూ కథ

## 18



జవాహర్ జైలు నుంచి విడుదల అయి వచ్చేసరికి కాంగ్రెసు సంస్థ భీభత్సమైన స్థితిలో ఉన్నది. అందులో ఇప్పుడు ఆదర్శాలకు చోటు లేదు. నాయకులు రెండు పక్షాలుగా చీలిపోయారు. ముఠా రాజకీయ వాదులు చౌకబారు రాజకీయ పద్ధతులవలంబించి, సంస్థను హస్తగతం చేసుకోవాలని చూస్తున్నారు. దేశంలో ఉద్యమం చప్పచల్లారి ఉన్నది.

కాంగ్రెసులో ఒక పక్షం మార్పు పనికిరాదనేవారు, వీరి కార్యక్రమం సంస్కరణలు జరపటమే తప్ప, రాజకీయోద్యమం నడపటం కాదు.

రెండో పక్షం స్వరాజిస్టులు, వారి కార్యక్రమం శాసనసభలలో జొరబడి, ప్రభుత్వంతో పోరాటం కొనసాగించటం.

స్వరాజిస్టుల పక్షానికి నాయకులు చిత్తరంజనదాసూ, మోతీలాల్ నెహ్రూనూ. యూరపు నుంచి తిరిగి వచ్చిన మహమ్మదలీ కూడా శాసన సభలను నిషేధించరాదనీ, ఐరిష్ విప్లవవాదుల లాగా ఎన్నికలలో నిలబడి, వాటిలో పాల్గొన నిరాకరించాలనీ సూచించాడు. కాని కాంగ్రెసు ఉద్యమానికి మూలవిరాట్టయిన గాంధీజీకి శాసన సభా ప్రవేశం ఇష్టం లేదు. నాయకులు ఎన్నికలకు నిలబడి, శాసనసభలలో పాల్గొనకపోతే సామాన్య ప్రజలకు ఏమీ అర్థం కాదు; ఎన్నికలను బహిష్కరించా లన్నట్టయితే వారికి స్పష్టంగా తెలుస్తుంది; అదీ గాక, ఒకసారి శాసనసభలను మరిగితే మానటం కష్టం.

జవాహరుకు గాంధీజీ వాదనలో బలం కనిపించినా, కాంగ్రెసులో ఏర్పడిన రెండు పక్షాల పట్లా అసహ్యం పుట్టుకొచ్చింది. అతను తన రాష్ట్రంలో కాంగ్రెసు సంస్థను



సంస్కరించ బూనుకున్నాడు. అతను రాష్ట్రకమిటీ కార్యదర్శి. కాని అతని మనస్సు వికలంగా ఉన్నది. కార్యరంగంలో దిగి పని చెయ్యాలన్న ఉత్సాహం ఉన్నది గాని, మానసికంగా ఎడతెగని సందేహాలు బాధించాయి. ఎంత శ్రమ పడినా ఫలితం లేకపోయింది.

ఇంతలో జవాహరుకు తలవని తలంపుగా ఒక కొత్త పదవి లభించింది—అతను అలహాబాదు మునిసిపాలిటీకి చైర్మన్ అయాడు. అతన్ని చైర్మన్ పదవికి పోటీ పెట్టాలన్న ఆలోచన ముప్పావుగంట ముందుగా వచ్చిందట. పురపాలక సంఘ సభ్యులుగా ఎన్నికైన కాంగ్రెసువారు సమావేశమై చర్చలు జరిపి, జవాహరును నిలబెట్టకపోతే గెలుపు రాదని అప్పటికప్పుడు నిశ్చయించారు.

చిత్రమేమిటంటే ఆ సమయంలో అనేక మంది ప్రముఖ కాంగ్రెసు నాయకులు మునిసిపాలిటీలలో ఉన్నత పదవులలో ఉన్నారు. చిత్తరంజనదాసు కలకత్తాకు మొదటి మేయరయాడు. విఠల్‌భాయి పటేలు బొంబాయి కార్పొరేషనుకూ, వల్లభాయిపటేలు అహమ్మదాబాదు మునిసిపాలిటీకి అధ్యక్షులు. యు. పి. లో అనేక పురపాలక సంఘాలకు కాంగ్రెసు నాయకులే అధ్యక్షత వహించారు.

పురపాలన కార్యకలాపాలలో జవాహరుకు మంచి ఆసక్తి ఏర్పడింది. అతను వాటిని గురించి దీక్షగా పనిచేయ నారంభించి, ఎన్నో సంస్కరణలను గురించి కలలు కూడా కనసాగాడు. అయితే పురపాలనలో అలాటి కలలకు తగిన పరిస్థితులు లేవు. భారీ సంస్కరణలకు ప్రభుత్వం ప్రోత్సాహమివ్వదు. అన్నిటికీ కీలకమైన డబ్బు ప్రభుత్వం చేతిలో ఉన్నది. అయినప్పటికీ, ఉన్నంతలో మునిసిపల్ కార్యక్రమాన్ని శుద్ధం చేసి, వేగవంతం చెయ్యటానికి జవా



హరు యావచ్ఛక్తితో పనిచేశాడు. దీనికి తోడు అతని కాంగ్రెసు పని బరువు కూడా పెరిగింది; అతన్ని రాష్ట్రకాంగ్రెసు కమిటీ కార్యదర్శిగానే గాక, ఆలిండియా కార్యదర్శిగా కూడా చేశారు. రోజుకు పదిహేను గంటలు పనిచేసి, హూనమై ఇల్లు చేరుకునేవాడు... జవాహరు మున్సిపల్ చైర్మనుగా చాలా సమర్థతతో పనిచేశాడనటానికి సందేహం లేదు. అందుకు నిదర్శనంగా రికార్డున్నది. అందుకనే అతని రాజకీయ ప్రత్యర్థి ఒకడు, "నెహ్రూ సోషలిస్టు భావాలకేం గాని, చైర్మనుగా అతను మునిసిపల్ వ్యవహారాలు నడిపిన వైనం వర్ణనాతీతం," అన్నాడట.



కొత్త శాసనసభలు కేంద్రంలోనూ, రాష్ట్రాలలోనూ వెలిశాయి. ప్రభుత్వం వేసిన ఎర అద్భుతంగా పారింది. ఒకప్పుడు జాతీయ వాదులుగా తిరిగిన వారు చాలా మంది పదవుల కెగబడి, ప్రభుత్వంతో సహకరించసాగారు. అలహాబాదు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి గ్రిమ్‌వుడ్‌మియర్స్ అనే ఆయన జవాహరుతో పరిచయం పెంచుకుని స్నేహం చెయ్యసాగాడు. ఇద్దరికీ మధ్య ఏమంత పరిచయం లేదు. ఆయన రావటమూ, జవాహరు వకీలు వృత్తి చాలించుకోవటమూ దాదాపు ఒకేసారి జరిగింది. మియర్స్ ఏదో మిష మీద జవాహరును వచ్చి చూసి పోతూ, చల్లగా అసలు సంగతి బయటపెట్టాడు: జవాహరు సరే నన్నట్టయితే అతనికి విద్యామంత్రి పదవి లభించే అవకాశం లేకపోలేదు!

ఆ రోజుల్లో మంత్రిత్వాలు కారుచౌకగా ఉన్నాయి. ఆ సమయంలోనే యు. పి. ప్రభుత్వం ఒక పెద్దమనిషికి మంత్రి పదవి ఇవ్వజూపిందట. దానికి జవాబుగా ఆ పెద్దమనిషి, తాను గొప్ప తెలివిగలవాణ్ణి కాననీ, అయినా కొంత తెలివి ఉన్నట్టు అందరిచేతా గుర్తించబడుతున్నాననీ, అలా



టప్పుడు మంత్రిత్వం ఆమోదించి, అందరి చేత పరషు శుంఠ అనిపించు కోవటం దేనికనీ అన్నాడట.

ఒకప్పుడు ప్రభుత్వం కాంగ్రెసు ఉద్యమాన్ని ఎదుర్కొనటానికి మితవాదులను మంత్రులుగా వేసుకున్నది, వారిని గౌరవంగా చూసింది. కాని కాంగ్రెసు ఉద్యమం నిలిచిపోగానే మితవాదులతో ప్రభుత్వానికి పని తీరిపోయింది. వారు వెళ్ళాక ప్రభుత్వానికి కొత్త మంత్రులు దొరకలేదు. కౌన్సిలు సభ్యులలో మితవాదు లున్నారు గాని, వారు అలిగారు; జమీందార్లున్నారు గాని వారిలో నిజంగా చదువుసంధ్య లున్నవారు చాలా కొద్దిమంది. కాంగ్రెసేమో కౌన్సిళ్ళను బహిష్కరించింది.

జవాహరును హెచ్చుగా బాధించినది కాంగ్రెసు ఉద్యమం నిలిచిపోపటం. కాంగ్రెసు భవిష్యత్తూ, దేశ భవిష్యత్తూ ఎలా ఉండబోయేదీ అతనికి అంతుచిక్క లేదు. దేశ ప్రజల వాంఛలకు ప్రతిబింబమైన గాంధీజీ వారి వాంఛ లున్నంత అస్పష్టంగానూ ఉండిపోయి, వాటి కొక స్పష్టమైన రూపం ఇవ్వలేకుండా ఉన్నాడు. విస్పష్టమైన లక్ష్యం లేదు. స్వాతంత్ర్యం కోసం పోరాట మన్న అయోమయమైన భావం తప్ప, ఒక నిర్దిష్టమైన ఆర్థిక, సాంఘిక, రాజకీయ పథకం లేదు.

"స్వరాజ్యం" అన్న దానికి అర్థం స్వపరిపాలనా, లేక స్వాతంత్ర్యమా? ఇండియా స్వతంత్ర మయాక కూడా రైతులు భూస్వాముల పిడికిట్లోనూ, కార్మికులు పెరిగి వచ్చే పెట్టుబడిదార్ల వాతా పడి ఉంటారా? ఇలాటి ప్రశ్నలు జవాహరును అమితంగా బాధించసాగాయి.

జవాహరులో సోషలిస్టు భావాలు అస్పష్టంగా కదల నారంభించాయి. 1926 లో అతను యూరపు వెళ్ళే దాకా వాటికి బలం చేకూరలేదు.





# నవాబునందిని

## 5

మానసింహ మహారాజు అంతులేని పరివారాన్ని వెంటబెట్టుకుని పూరీ జగన్నాథ క్షేత్రం చేరుకున్నాడు. సముద్ర తీరాన ఆయన కోసం ఒక మైలు నిడివీ, వెడల్పూ గల నగరం లాటి శిబిరం నిర్మించారు.

మహారాజు జగన్నాథ క్షేత్రానికి బయలుదేరే ముందుగా పఠానుల కొక లేఖ పంపుతూ, తాను వారి రాజ్యం గుండా ప్రయాణించే టప్పుడు నవాబులు తనను వచ్చి చూడాలనీ, తనకు తగిన ఏర్పాట్లు చేయాలనీ అడిగాడు. కాని ఆయనను చూడటానికి సులేమాన్‌ఖాన్ గాని, ఉస్మాన్ ఖాన్ గాని రాలేదు. నవాబు కుటుంబానికి చెందిన వ్యక్తి ఎవరో వచ్చి స్వాగతం తెలిపాడు. పఠానుల ప్రవర్తన మానసింహుడికి అసంతృప్తి కలిగించింది.

మానసింహ మహారాజుకు పట్టపురాణి జగతసింహుడి తల్లి. మానసింహుడికి ఆమె పైన ఎంతో గౌరవం, కాని ప్రేమ అంతగా లేదు, పై పెచ్చు కొంత భయం కూడా ఉన్నది. భర్త దేశదేశాలు తిరుగుతుంటే ఆమె ఆయన వెంట తిరగదు. మానసింహుడి కింకా అనేక భార్య లున్నారు. కాని అందరి కన్న జోధ్పూరు రాజకుమార్తె అయిన ఊర్మిళ అంటే ఆయనకు అంతులేని ప్రేమ. పూరీజగన్నాథ క్షేత్రానికి ఆయన వెంట వచ్చిన ముగ్గురు భార్యలలో ఆమె కూడా ఉన్నది.

దామోదర ముఖర్జీ



పూరీలో మహారాజు కవసరమైన ఏర్పాట్లన్నీ తృప్తికరంగా చేసినవాడు రామచంద్ర దేవు డనేవాడు. అతను దేవవంశం వాడు. ఒరిస్సాను పఠానులు జయించక పూర్వం దేవవంశపు రాజులే అక్కడ పరిపాలన చేశారు. పూరీ క్షేత్రం సంధి నిబంధనల ప్రకారం మొగలులది కాగానే రామచంద్ర దేవుడు దానికి శాసనాధికారిగా నియమించ బడ్డాడు.

పూరీలో మానసింహుడు వారం రోజులుండ సంకల్పించాడు. అందులో రెండు రోజులు గడిచిపోయాయి. మూడో నాడు సాయంకాలం మానసింహుడు జగన్నాధాలయంలో మంగళహారతి చూసి ఊర్మిళ ఉండే డేరాకు తిరిగి వచ్చాడు. ఆయన కోసం వంట తయారు చేస్తున్న ఊర్మిళ ఆయన వచ్చినట్టు తెలిసి ఆయన ఉన్న చోటి కొక బాలికను వెంటబెట్టుకుని వచ్చింది. ఆ బాలిక అసాధారణ సౌందర్యవతిగా ఉన్నది.

"ఈ అమ్మాయి ఎవరు? సాక్షాత్తూ లక్ష్మి లాగుందే!" అని మానసింహుడడిగాడు.

"ఈ పిల్ల నా స్నేహితురాలి కూతురు. తల్లి కూతుళ్ళు జగన్నాధస్వామి దర్శనార్థం వచ్చారట, ఇవాళ మధ్యాహ్నం నన్ను చూడవచ్చారు. నా స్నేహితురాలు వెళ్ళిపోయింది, కాని నేనీ పిల్లను కొన్నాళ్ళు నా వద్ద ఉంచుకుంటానని నిలిపేశాను," అన్నది ఊర్మిళ.

"ఈమెకు పెళ్ళి అయిందా ?"

"అయింది, కాని ఆ సందర్భంలో మీతో చెప్పవలిసిన విషయం ఒకటున్నది. దాని విషయం తరవాత మనవి చేస్తాను."

"అలాగే. ఈ అమ్మాయి పేరేమిటి ?"

"రాజలక్ష్మి."

"బాగుంది. నిశ్చయంగా ఈమె రాజలక్ష్మే."



అది మొదలు రాజలక్ష్మి మహారాజుకు అనేక విధాల సేవ చేస్తూ ఆయనను మెప్పించింది.

మానసింహుడు పూరీకి వచ్చి పది రోజు లయింది. కాని ఆయన శిబిరం ఎత్తి వెళ్ళి పోయే సూచన లేవీ లేవు. ఈ లోపుగా పఠానునవాబుల వార్తలు కొన్ని ఆయన కందాయి. మంచాన పడి ఉన్న ముసలి వజీరు ఈసాఖాన్ చనిపోయాడు. పేరుకు నవాబయినా సులేమాన్‌ఖాన్‌కు రాజకీయాల గొడవ ఏమీ తెలియదు; అతనా బాధ్యత లన్నిటినీ ఉస్మాన్‌ఖాన్‌కే వదిలిపెట్టేశాడు. కొత్త వజీరుగా ఖిజర్‌ఖాన్ అనే వాణ్ణి ఉస్మానే నియోగించాడు. ఖిజర్‌ఖాన్ అన్ని విధాలా ఉస్మాన్‌ఖానును పోలినవాడు; సాహసికుడు; యుద్ధ ప్రియుడు. అతని వయసు నలభై ఆరేళ్ళు. రాజ్యపాలన యావత్తూ ఉస్మాన్ ఖాన్ చేతి పైననే నడుస్తున్నది.

మానసింహు డీ సమాచార మంతా తెలుసుకుని రామచంద్రదేవుడితో సమాలోచన చేశాడు. ఉస్మాన్ త్వరలోనే సంధికి స్వస్తి చెప్పేస్తాడు. అతని ప్రవర్తన అది వరకే నిర్లక్ష్యంగా ఉంటున్నది. అతను మానసింహుణ్ణి పూరీలో కూడా చూడరాలేదు. అతను యుద్ధపిపాసి. అతనికి పాదుషా పట్ల



గౌరవాభిమానా లేమీ ఉన్నట్టు కనబడ లేదు. మానసింహుడు తాను పఠానులతో యుద్ధం చెయ్యటానికి సంసిద్ధుడుగా లేని తరుణంలో సంధి చేసుకున్నాడు. ఇప్పుడాయన యుద్ధానికి ఆయత్తుడై ఉన్నాడు. కాని, పఠానులు తామై సంధి నియమాలను ఉల్లంఘించితే తప్ప, వాటికి భంగం కలగటం ఆయన కిష్టం లేదు.

చివరకు ఉస్మాన్ పూరీ నగరానికి వచ్చాడు. అపరాహ్ణ వేళ మహారాజు, మిత్ర రాజుల తోనూ, రామచంద్రుడి తోనూ సభా మంటపంలో కూర్చుని ఉండగా ఉస్మా నక్కడికి వచ్చాడు. మానసింహు డతనికి



చేయవలిసిన మర్యాదలన్నీ చేసి ఉచితాసనం చూపాడు.

ఉస్మాన్ చాలా అందమైనవాడు, చాలా మంచి దుస్తులూ, తలపాగా, పొడుగాటి ఖడ్గమూ ధరించి ఉన్నాడు. మహారాజు లాంఛనగా ముసలి వజీరు మరణం గురించి మాట్లాడి, "నేను ఒరిస్సా దేశానికి వచ్చానే గాని, ఒరిస్సా నవాబుల దర్శన భాగ్యం కలుగుతుం దనుకోలేదు. ఇవాళ మా అదృష్టం వల్ల ఆ భాగ్యం కలిగింది," అన్నాడు కొంచెం వెటకారంగా.

ఉస్మాన్ ఆ వెటకారాన్ని అర్థం చేసుకుని, "మేము నిజంగా తమకు ఆత్మీయుల మైనట్టయితే మా దర్శనం భాగ్యంగా అనుకోవటానికి వీలుండేదేమో. కాని మాకు తమ ఆత్మీయులమై ఉండే భాగ్యం లేదు. ఉండినట్టయితే మేము తమ దర్శనం చేసుకోమని అజ్ఞాపిస్తూ దాసులకు రాసినట్టుగా రాసిఉండరు," అని కుండ పగలేసినట్టు అనేశాడు.

మానసింహుడు కూడా కుండ పగలేసినట్టు మాట్లాడ నిశ్చయించుకుని, "అజ్ఞలు పాలించే దాసులు ఆత్మీయులు కాకూడదని ఎక్కడున్నది? కావటమూ కాకపోవటమూ వారి గుణాలను బట్టీ, శక్తిని బట్టీ ఉంటుంది. నవాబులు పాదుషాకు లోబడి ఉండటానికి సమ్మతించారు; ఆత్మీయులుగా ఉంటారో, ఉండరో వారే తేల్చుకోవాలి," అన్నాడు.

మీరు మా అజ్ఞలను పాలించే దాసులే నని మానసింహుడు స్పష్టంగానే అనే సరికి ఉస్మాన్ ముఖం కంది పోయింది. అతను ఓర్పు తెచ్చుకుని, "బంగాళా దేశపు సుబేదారుగారూ, నేను మీతో వాదించటానికి రాలేదు. మీ వంటి వారితో వాదించటం నాకు పరువు తక్కువ. మీతో అనేక ముఖ్య విషయాలు మాట్లాడ వలిసిన అవసరం ఉన్నది, కాని మీ రిప్పుడు ప్రకటించే వైఖరి



చూస్తే, వాటిని ప్రస్తావించటం మంచిది కాదనిపిస్తున్నది. నేను వెళ్ళిపోతాను; కాని వెళ్ళే ముందు మీతో ఒక్క విషయం చెప్పవలిసి ఉంది, అది నా స్వవిషయం," అన్నాడు.

"మీరు చెప్పేది వినటానికి నా కేమీ అభ్యంతరం లేదు. మీతో విరోధం పెట్టుకోవటం నా ఉద్దేశం కాదు. నా స్నేహాన్ని పోగొట్టుకోకుండా ఉండటం మీకు మంచిదని నేను మళ్ళీ మళ్ళీ చెప్పదలిచాను," అన్నాడు మానసింహుడు.

"ఆ విషయాలను గురించి మాట్లాడటం నా కిష్టం లేదు. మీరు మీ కొడుకైన జగతసింహుడికి యావజ్జీవ కారాగారశిక్ష విధించారు. అందుకు కారణం అతనికీ నవాబు నందిని అయిన ఆయుషాకూ మధ్య ప్రేమ ఉన్నట్టు వ్యక్తం కావటమేనా?" అని ఉస్మాన్ అడిగాడు.

"జగతసింహుడు ఆయుషా ప్రేమను ప్రేరేపించటం నిజంగా అపరాధమే. కాని అతని శిక్షకు ఇతర కారణాలు కూడా ఉన్నాయి. అతను అవిధేయుడు; రాజకార్యాల పట్ల అశ్రద్ధ వహించాడు. శత్రువులతో స్నేహ సంబంధాలు పెట్టుకున్నాడు. ఇవన్నీ అపరాధాలే."



"జగతసింహుడు నాకు శత్రువు. అతని హితం నేను కోరను. కాని అతను చెయ్యని అపరాధానికి శిక్ష పొందుతుంటే నేను సహించలేను. ఆయుషా ప్రేమ విషయంలో అతని అపరాధం ఏమీ లేదు. అతను తనకు ఆయుషా పైన ప్రేమ ఉన్నట్టు ఏ విధంగానూ ప్రకటించ లేదు. ఆయుషా తనకు తానే అతన్ని ప్రేమించింది. ఆ విషయం తెలిసి కూడా అత నామెను ప్రేమించ లేదు. ఈ సంగతి చెప్పటం నా విధి."

"ఇదే నిజమైతే మీకూ, జగతసింహుడికీ ద్వంద్వ యుద్ధం ఎందుకు జరిగిందీ?"








"మొగలాయీలకూ, పఠానులకూ జరిగిన సంధి ఇక ఎంతోకాలం నిలవదు," అనుకున్నారు సభలో మిగిలిన వాళ్ళు. మానసింహుడు కొంత కలవరపడుతూ సభ చాలించి, జగన్నాథస్వామికి హారతి ఇవ్వటానికి బయలుదేరాడు.

ఉస్మాన్ స్వర్ణదుర్గానికి తిరిగి వెళ్ళిపోయాడు, కాని అతని చారులు మానసింహుడి వార్తలను ఎక్కటికప్పుడందజేస్తూనే ఉన్నారు. సాధ్యమైనంత త్వరలో సంధికి భంగం కలిగించాలని ఉస్మాన్ ఉద్దేశం. ఆ సంధి అతనికి దుర్భరమైన అవమానంగా ఉండి బాధిస్తున్నది. అతను యుద్ధసన్నాహాలు చేయ నారంభించాడు.

ఒకనాడు ఉస్మాన్ దుర్గ ప్రాసాదంలో ఒంటరిగా కూర్చుని ఉండగా, నవాబు నందిని ఆయషా, పక్కనే ఉన్న అంతఃపుర ద్వారం తెరిచి, "నవాబు ఒక్కరే ఉన్నట్టుంది. నేను కాస్సేపు రావచ్చునా?" అని అడిగింది.

"రావచ్చునా అని అడుగుతున్నావా, ఆయషా? కాకి చేత కబురు చేస్తే నేనే నీ దగ్గర వాలేవాణ్ణి గదా, ఎందుకు నువే బయలుదేరి వచ్చావు? ఏమిటి విశేషం?" అన్నాడు ఉస్మాన్.

ఉస్మాన్‌ఖాన్ కొంచెం సిగ్గుపడుతూ, "చెబుతాను వినండి. నేను ఆయషాను ప్రేమించాను. కాని ఆమె మనస్సంతా జగతసింహుడితో నిండి ఉండటం చేత నా కక్కడ చోటు లేకుండా పోయింది. జగతసింహుడు బతికి ఉన్నంత కాలమూ ఆమె అతన్ని మరవదు. అందుచేతనే నే నతన్ని చంపాలని ప్రయత్నించాను, కాని, ఓడాను. అతన్ని చంపే అవకాశం కోసం ఎదురు చూస్తున్న నాకు అతని యావజ్జీవ కారాగార శిక్ష పెద్ద ఆటంకమై పోయింది," అంటూ ఉస్మాన్‌ఖాన్ లేచి, అందరికీ సలాము చేసి వెళ్ళిపోయాడు.








ఆయుషా ముఖం విచారంతో నిండి ఉన్నది. ఆమె అతని గదిలోకి వచ్చి కూర్చున్నది. ఉస్మాన్ గది తలుపు గడియ పెట్టి వచ్చి, "చెప్పు," అన్నాడు.

"నీతో ఒక్క మాట చెప్పుదామని వచ్చాను. నేను నిన్ను ప్రేమించటం లేదని జ్ఞాపకం ఉంచుకో; అనవసరమైన భ్రమలు పెట్టుకోకు," అన్నది ఆయుషా.

"చెప్పు. నీ మాటలు వినటం నాకు పరమానందమే," అన్నాడు ఉస్మాన్.

ఆమె కొంచెం సేపు పస్తాయించి, "నువ్విప్పుడు యుద్ధ ప్రయత్నాలలో మునిగి తేలుతున్నట్టున్నావు. పనికిమాలిన విషయాలతో నిన్నిప్పుడు బాధించటం బాగుండదేమో," అన్నది.

"నువ్వెంత అనర్థక విషయం చెప్పినా నాకు బాధలేదు. చెప్పకపోతేనే నేను బాధ పడతాను."

"నిజంగా నువు నాపై చూపే అనుగ్రహానికి మేరలేదు. అందుకు నే నేమీ ప్రత్యుపకారం చెయ్యలేకపోతున్నాను."

"ఆయుషా, నేను నీ మీద చూపిన అనుగ్రహ మేమిటో నాకు తెలీదు. కాని నన్ను నీ మేలు కోరే వాడుగా భావిస్తే అదే నాకు మహాభాగ్యం."

ఆయుషా తల వంచుకుని, "నే నిక్కడ ఉండగూడ దనిపిస్తున్నది," అన్నది.

ఉస్మాన్ దెబ్బతిన్న వాడి లాగా అయి పోయి, దీనంగా, "ఆయుషా, ఈ మాట చెప్పటానికా వచ్చావు? నువ్విక్కడ లేక పోతే ఇంకెవరుంటారు? నువ్విక్కడ ఉండ బట్టే ఈ ఉస్మా నింకా ప్రాణాలతో ఉన్నాడు. నువు నా దానివి కాకపోవటం నా దౌర్భాగ్యం. కాని నాలో ఇంకా ఆశ చావలేదు. బతికి ఉండగా ఎప్పటికైనా నువు నన్ను ప్రేమించి, నా దాని వవుతా వన్న ఆశతో బతికి ఉన్నాను. ఆ ఆశను కూడా తుంచేస్తావా?" అన్నాడు.

"ఉస్మాన్, నీ హృదయం అపూర్వమైనది. నీ ప్రేమ అసాధారణమైనది. కాని, అందువల్ల నీకు బాధ తప్ప మరేమీ ఉండటంలేదు. రాయిలాటి నన్ను ప్రేమించి నీకు బాధ కలగటం కన్న నేను నీ ఎదట లేకుండా పోవటం మనిద్దరికీ మేలే ననుకుంటున్నాను."

"అయుషా, నీ నుంచి నాకు ఆనందం కలగటం లేదనుకోకు. దూరం నుంచి నిన్ను చూసీ, నీ కంఠం వినీ నేను పరమానందం పొందుతున్నాను. ఆ ఆనందం కూడా లేకుండా చేస్తావా?"

"నేను దూరంగా ఉంటే నన్ను మరిచి పోగలుగుతావు."

"నువు ప్రేమించే వ్యక్తి చాలా కాలంగా నీకు దూరమయాడు, అతన్ని మరిచి పోయావా?"

"మగవాళ్ళ దారి వేరు. వాళ్ళ కెన్నో వ్యాపకా లుంటాయి. ఆడదానికి ప్రేమ తప్ప జీవితంలో మరొకటేముంది? నువ్వీ రాతి బొమ్మను సులభంగా మరిచిపోగలవు."

"నా శరీరం మట్టిలో కలిశాక మరిచి పోతానేమో, అంతదాకా అది అసంభవం. నువు ప్రేమించే వాణ్ణి నా చేతులారా ఎప్పటికైనా చంపుతా నన్న ఆశ నా కున్నది. అప్పటికీ నువు నన్ను ప్రేమించలేకపోతే నా ప్రతిద్వంద్వి పోయాడన్న తృప్తి అయినా నా కుంటుంది."

"ఉస్మాన్, నేను జీవించి ఉన్నది కీడు పెంపొందించటానికే లాగుంది. నేను కోరేదెల్లా నువు సుఖంగా ఉండాలనే. నేను మళ్ళీ నీకు కనిపించ ననుకుంటాను. నీకు పెద్ద అపద ఏదైనా సంభవించే పక్షంలో, అది నా వల్ల తొలగే అవకాశం ఉన్న పక్షంలో అప్పుడు వస్తాను," అన్నది అయుషా.

ఈ మాటలను తల వంచుకుని వింటున్న ఉస్మాన్ తిరిగి తల ఎత్తి చూసే సరికి అయుషా అక్కడ లేదు. —(ఇంకా వుంది)





# మూడు నిమ్మకాయలు

ఒక గ్రామంలో ముగ్గురన్నదమ్ము లుండే వారు. తల్లిదండ్రులు పోయాక వారికి ఆధారం ఏమీ లేకుండా పోయింది. అందు చేత వాళ్ళు గ్రామం వదిలి మరెక్కడనైనా పని చేసుకుందా మని బయలుదేర నిశ్చ యించు కున్నారు.

పెద్దవాళ్ళిద్దరూ చిన్నవాణ్ణి తమవెంట రావద్దన్నారు. వాళ్ళు తమ మూటా ముల్లె సర్దుకుని ఒక రాజుగారి వద్దకు వెళ్ళారు. వాళ్ళు అక్కడికి చేరేసరికి మూడోవాడు నాగులు కూడా అక్కడికి చేరనే చేరాడు.

రాజుగారు వాళ్ళ మొర విని, "ప్రస్తు తానికి మీ కిచ్చేటందుకు పని ఏమీ లేదు. అయినా మీరు చాలా దుస్థితిలో ఉన్నారు గనక వంట ఇంటికి కావలిసిన నీరూ, వంటచెరుకూ చేరవేస్తూ ఉండండి," అన్నాడు. వాళ్ళు సంతోషంగా అందుకు ఒప్పుకున్నారు.

కొద్ది రోజులు గడిచాక రాజు పెద్దవా ళ్ళిద్దరినీ పిలిచి, "మీ ఇద్దరి కన్నా నాగులు రెట్టింపు నీరు తెస్తున్నాడుట, రెట్టింపు వంట చెరుకు తెస్తున్నాడుట, మీ రింత మంద కొడిగా ఉన్నారేం?" అని అడిగాడు.

రాజుగారి భార్య కొద్ది కాలం కిందటనే పోయింది. ఆయన తిరిగి ఇంకా పెళ్ళాడ లేదు. అది పెద్దవాళ్ళిద్దరికీ తెలుసు. వాళ్ళు నాగులు పీడ వదిలించుకుందా మని రాజుగారితో, "మా నాగులు ఎప్పుడూ సమర్థుడే నండీ. వాణ్ణి పంపారంటే మీకు వారం లోపల జగదేకసుందరిని తెచ్చి భార్యగా చెయ్యగలడు. మీరు వాడికి అలుసు దొరకకుండా మాత్రం చూసుకోవాలి, అంతే!" అన్నారు.

చక్కని భార్యను పెళ్ళాడాలని రాజు గారికి ఆశ పుట్టింది. ఆయన నాగులును పిలిచి, "ఒరే, నీ శక్తి తెలియక నీ చేత

సి. ఉమాపతి



నీళ్ళూ, కట్టెలూ మోయించాను. ఇక నువ్వా పని మాని, నేను పెళ్ళాడటానికి ఒక జగదేక సుందరిని తెచ్చిపెట్టు. నీకు వారం రోజులు గడు విస్తున్నాను," అన్నాడు.

"అంత పని నా వల్ల అవుతుందా మహారాజా? నాకు శక్తి ఉందని నే నెప్పుడూ చెప్పుకో లేదే?" అన్నాడు నాగులు.

"వారం రోజుల్లో జగదేకసుందరిని తీసుకురాకపోయావో నీ తల తీయించి కోట గుమ్మానికి కట్టిస్తాను. ఏమనుకున్నావో!" అని రాజుగారు నాగుల్ని భయపెట్టాడు.

ఇక నాగులుకు బయలుదేరక తప్ప లేదు. రాజుగారి వంటలక్క నాగులుకు మంచి మంచి ఆహారపదార్థాలు మూటగట్టి ఇచ్చింది. వాడు అడవి మార్గం పట్టి కొంత దూరం వెళ్ళాక ఆకలి వేసింది. అందుచేత వాడు ఒక చెట్టు కింద కూర్చుని ఆహారం మూట విప్పసాగాడు.

అంతలోనే ఒక ముసలిది వా డున్న చోటికి వచ్చి, "ఆ మూటలో ఏమిటి, నాయనా?" అని అడిగింది.

"భోజనం. కావలిస్తే నువు కూడా ఇంత తిను," అన్నాడు నాగులు.

ఇద్దరూ కడుపునిండా తిన్నాక, ముసలిది నాగులుతో, "నీ రుణం ఉంచుకోనులే, బాబూ. ఏం పని మీద పోతున్నావు? ఎక్కడి దాకా ప్రయాణం?" అని అన్నది.

నాగులు తాను బయలుదేరిన పని గురించీ, రాజుగారి బెదిరింపు గురించీ ముసలిదానికి చెప్పాడు.

"నీకు జగదేకసుందరి కావాలంటే, ఈ దిక్కుగా పోతే మాయావు లుండే కోట వస్తుంది. అక్కడ జగదేకసుందరులు దొరుకుతారు. ఈ శంఖం ఊదావంటే నిన్ను మాయావు లేమీ చెయ్యరు సరేకదా, వాళ్ళు నువు చెప్పినట్టు వింటారు," అని ముసలిది నాగులు కొక శంఖం ఇచ్చి తన దారిన తాను వెళ్ళిపోయింది.

చాలా సేపు శ్రమపడిన మీదట నాగు లుకు ఆ శంఖాన్ని ఊదటం చాతనయింది. అది మోగిన మరుక్షణం అతని చుట్టూ మాయావులు ప్రత్యక్షమై "ఏం కావాలి, దొరా? ఏం సెలవు?" అని కేకలు పెట్టారు.

"నా కొక జగదేకసుందరిని తెచ్చిపెట్ట గలరా?" అన్నాడు నాగులు, లోలోపల వాళ్ళను చూసి భయపడుతూనే.

"జగదేకసుందరులను తాకే శక్తి మాకు లేదు గాని, వాళ్ళుండే చోటికి నిన్ను చేర్చుతాం," అని మాయావులు నాగులును ఒక కోట వద్దకు ఎత్తుకుపోయి దించారు. కోట నిర్జనంగా ఉన్నది. నాగులు లోపలికి వెళ్ళేసరికి అక్కడ ముగ్గురు రాజకుమా ర్తెలు అతని కళ్ళ పడ్డారు. నాగులును చూస్తూనే వాళ్ళు భయపడిపోయి, కంగా రుగా అటూ ఇటూ పరిగెత్తి, అంతలోనే అదృశ్యమైపోయారు.

నాగులు కోట అంతా తెగ వెతికాడు, కాని వాళ్ళ జాడ ఏమీ తెలియలేదు. వాళ్ళు అలా కంగారుపడి పరిగెత్తకపోయి నట్టయితే వారిలో ఏ ఒకతెనైనా బతిమాలి తన వెంట తీసుకుపోయి రాజుగారి కిచ్చి, తన తలను రక్షించుకుని ఉండేవాడు. ఇక తాను వట్టి చేతులతో తిరిగిపోక తప్పదు, రాజుగారు తన తల తీయించటం అంతకన్నా తప్పదు.





నాగులు ఇలా అనుకుంటూండగా సుందరులు కనిపించిన చోట ఒక గూట్లో వాడికి మూడు నిమ్మపళ్ళు కనబడ్డాయి. ప్రయాణం చేసేటప్పుడు నిమ్మపళ్ళు దగ్గిర ఉంటే దాహానికి తట్టుకోవచ్చునని నాగులు వాటిని తన సంచీలో వేసుకుని ఇంటిదారి పట్టాడు.

కొంత దూరం వెళ్ళేసరికి నాగులుకు అపరిమితమైన దాహం పట్టుకున్నది. ఎండ మండిపోతున్నది. కనుచూపు మేరలో ఎక్కడా తడినేల అన్నది కూడా లేదు. అందుచేత వాడు సంచీలో నుంచి ఒక నిమ్మకాయ తీసి కోశాడు. అందులో



ఒక అపూర్వ సుందరి తల కనిపించి, "దాహం! చచ్చిపోతున్నాను!" అన్నది.

ఆ సుందరిని ఎలాగైనా బతికించి రాజుగారికి ఇస్తే తన తల కాచుకోవచ్చు ననుకుని నాగులు నీటి కోసం ఆ ప్రాంతమంతా చెడ వెతికాడు. ఎక్కడా ఒక్క చుక్క నీరు లేదు. వాడు వగర్చు కుంటూ తిరిగి వచ్చేసరికి, నిమ్మకాయలో దాగిన సుందరి చచ్చేపోయింది.

నాగులు పుట్టెడు విచారంతో ముందుకు సాగాడు. మరి కొంత దూరం వెళ్ళేసరికి వాడికి మళ్ళీ దుర్భరంగా దాహం వేసింది.

వాడు సంచీలో నుంచి మరొక నిమ్మకాయ తీసి కోశాడు. అందులో ఇంకా అందమైన సుందరి తల కనిపించి, "దాహం! చచ్చిపోతున్నాను," అన్నది. నాగులు రెట్టింపు ఆశతో నీటి కోసం అన్ని దిక్కులకూ చెడపరిగెత్తాడు. కాని వాడి శ్రమ ఫలించలేదు. ఎక్కడా నీరు దొరకలేదు. నిమ్మకాయలో కనిపించిన సుందరి ప్రాణాలు విడిచింది.

నాగులు కిప్పుడు ఒక ఆశ పుట్టింది. మూడో నిమ్మకాయలో మరొక జగదేక సుందరి ఉండి ఉంటుంది. ఆ నిమ్మకాయను కొయ్యకుండా తాను రాజభవనం



చేరే పక్షంలో ఆమె ప్రాణాలూ, తన తలా కూడా దక్కుతాయి. తాను అవివేకంగా నిమ్మకాయలు కోసి ఇద్దరు సుందరులను చావనిచ్చాడు. ఈసారి అలాటి పొరపాటు చెయ్యగూడదు.

కాని రాజభవనం చేరే లోపుగా నాగులుకు దాహంతో నాలుక ఈడ్చుకుపోసాగింది. నిమ్మకాయ కోసి తినకపోతే కొద్ది క్షణాలలో తన ప్రాణాలు పోయేటట్టు కనిపించాయి. వాడు పళ్ళబిగువున నడిచి, రాజుగారి ఇంటి సమీపంలో ఉన్న కొలను కనుచూపు మేరలో ఉండే చోటికి చేరి, దాహం భరించలేక, మూడో నిమ్మకాయ తీసి కోశాడు. అందులో అందరి కన్న అందమైన సుందరి తల కనిపించి, "దాహం! చచ్చిపోతున్నాను!" అన్నది.

వెంటనే నాగులు లేని శక్తి తెచ్చుకుని నిమ్మకాయతో సహా పరిగెత్తుకుంటూ వెళ్ళి, కొలను చేరుకుని, సుందరి చేత నీరు తాగించి, తాను కూడా తాగాడు. కొలనులోని నీరు తాగుతూనే జగదేకసుందరి పెరిగి పెద్దదై మామూలు ప్రమాణానికి వచ్చింది.

"అమ్మయ్య బతికాను! నువ్వీ చెట్టు మీదికి ఎక్కి, ఆకు గుబురు మధ్య దాక్కో. నేను వెళ్ళి రాజుగారిని పిలుచుకువస్తాను," అని నాగులు రాజభవనానికి వెళ్ళాడు.



ఇంతలోపల రాజుగారి వంటలక్క నీటి కోసం కొలనుకు వచ్చి, అందులో బిందె ముంచబోతూ, చెట్టు మీద ఉన్న జగదేక సుందరి ముఖం నీటిలో చూసి, "అమ్మ బాబోయ్! నే నింత అందంగా ఉన్నానా? అయితే నా కీ వంటలక్క పని చేసే కర్మే మిటి?" అని బిందె అక్కడే విసిరికొట్టి, వెనక్కు తిరిగేసరికి చెట్టు కొమ్మల మధ్య ఉన్న జగదేకసుందరి కనిపించింది.

వంటలక్కకు ఆమెను చూడగానే మండిపోయింది. ఆమె జగదేకసుందరిని కిందికి ఈడ్చి, ఆమె దుస్తులు తాను ధరించి, జగదేకసుందరిని మడుగులోకి తోసేసి, తానే చెట్టుకొమ్మలలో ఎక్కి కూర్చున్నది.

కొద్దిసేపటికి రాజుగారు తన నౌకర్లతో సహా వచ్చి చెట్టు మీద ఉన్న స్త్రీని దింపి చూచునుగదా, ఆ మనిషి జగదేకసుందరి కాకపోగా మామూలు సుందరి కూడా కాదు. ఆయనకు ఎక్కడలేని కోపం వచ్చి వంటలక్కనూ, నాగులునూ కూడా చెరలో పెట్టించాడు.

ఇది జరిగిన మర్నాడే రాజుగారి నౌకర్లకు కొలనులో ఒక తెల్లని చేప దొరికింది. దాన్ని వంటఇంటి దాసీలు కోసే సరికి ఒక చిన్న స్త్రీ బయటికి వచ్చి, వాళ్ళు చూస్తూండగానే మామూలు మనిషి అయింది.

దాసీలు వెళ్ళి రాజుగారితో ఈ వింత విషయం చెప్పారు. రాజుగారు పరిగెత్తు కుంటూ వచ్చి, జగదేకసుందరిని చూసి అమితమైన ఆశ్చర్యమూ, ఆనందమూ పొంది, ఆమె ద్వారా జరిగినదంతా తెలుసు కున్నాడు. ఆయన వెంటనే నాగులును చెర విడిపించి, వాడికి తన అంగరక్షకుడుగా ఉద్యోగమిచ్చి, జగదేకసుందరిని వైభవంగా పెళ్ళాడాడు. వంటలక్క తాను చేసిన నేరం ఒప్పుకున్నది. ఆమెను దేశం నుంచి తరిమే శాడు. నాగులు అన్న లిద్దరూ ఇంకా నీరూ, కట్టెలూ చేరవేస్తూనే ఉన్నారు.






# వృద్ధభిక్షుకుడు

పాపన్న ఉండే దేశంలో ఒకసారి యుద్ధ పరిస్థితి వచ్చింది. పొరుగు దేశపు రాజు ఈ దేశంలోని కొన్ని భాగాలు తన రాజ్యానికే చెందాలని తగాదా తెచ్చి, ఆ తగాదాను అంతకంతకూ పెంచి, చివరకు ఈ దేశం పై దురాక్రమణకు పూనుకున్నాడు. ఆయన సేనలు ఈ దేశంలోకి చొరబడి, కొన్ని గ్రామాలనూ, నగరాలనూ ఆక్రమించుకుని, చివరకు ఒక కోట వద్ద నిలవరించబడ్డాయి. అవి ఆ కోటను ముట్టడించి, నెలల తరబడి యుద్ధం సాగించి కూడా దాన్ని లోబరుచుకోలేక పోయాయి.

యుద్ధ కారణంగా దేశంలోని ప్రతి గ్రామం లోనూ గ్రామాధికారికి ప్రత్యేకమైన పనులు ఏర్పడ్డాయి. ఈ పనులు నిర్వర్తించటంలో పాపన్న తమ ఊరి గ్రామాధికారికి ఎంతో తోడ్పడ్డాడు. గ్రామాధికారి కొంత యుద్ధనిధి పోగుచేశాడు, సేనలో చేరటానికి కొందరు యువకులను సంపాదించాడు. ఆ డబ్బునూ, యువకులనూ వెంటబెట్టుకుని పాపన్న రాజధానికి వెళ్ళాడు.

అక్కడి పని పూర్తిచేసుకుని పాపన్న తిరుగుముఖమై వస్తూ చీకటిపడే వేళకు ఒక గ్రామసావడి చేరుకున్నాడు. అక్కడ అతనికి అనేకమంది బిచ్చగాళ్ళ లాటి వాళ్ళు ఒక గుంపుగా చేరి కనబడ్డారు. అంతమంది బిచ్చగాళ్ళు అక్కడ పోగవటానికి కారణ మేమిటని పాపన్న అడగగా, బిచ్చగాళ్ళనూ, గాలికి తిరిగేవాళ్ళనూ పట్టుకుని రాజధానికి పంపమని రాజాజ్ఞ అయినట్టు తెలిసింది. శత్రువుల వేగులవాళ్ళూ, గూఢచారులూ మారువేషాలతో దేశమంతటా తిరుగుతున్నట్టు రాజధానికి తెలియవచ్చిందట. ఈ బిచ్చగాళ్ళంతా ఆ ప్రాంతాలలో పట్టుబడినవాళ్ళు. వాళ్ళలో కొందరు పాపన్నను గుర్తించి, సంతోషం చెంది,



"పాపన్నగారూ, మమ్మల్ని అకారణంగా భటులు పట్టుకున్నారు. మీరైనా కాస్త మమ్మల్ని విడిపించి పుణ్యం కట్టుకోండి," అని వేడుకున్నారు.

"ఇంతలో మీకు వచ్చిన నష్టమేమిటి? రాజాజ్ఞ అమలు జరగనివ్వండి. మీకు కావలిసిన తిండి కేమీ లోపం రాదు. ఈ జరుగుతున్న యుద్ధం ముగిసేదాకా కాస్త ఓర్చుకోండి. ఆ తరవాత ఎప్పటిలాగే మీరు యథేచ్ఛగా తిరగవచ్చు," అన్నాడు పాపన్న ఆ బిచ్చగాళ్ళతో.

బిచ్చగాళ్ళలో ఒక వృద్ధుడు తెలిసిన వాళ్ళ నుంచి పాపన్న గురించి వివరాలు తెలుసుకుని, సైగ చేసి పాపన్నను దగ్గిరికి పిలిచి, రహస్యంగా, "అయ్యా, నాకు తమ వల్ల ఒక ఉపకారం కావాలి. ఈ ఊరి కోట వెలుపల తూర్పున ఒక కాళికాలయం ఉన్నది. అక్కడ నా కొడుకు ఒంటికంటి వెంక డనేవాడు ఉన్నాడు. నే నిలా చిక్కకున్నానని వాడితో చెప్పి, నే నిచ్చే పొట్లాన్ని వాడికి అందించాలి. నే నిక ఎక్కువ కాలం బతకను. ఈ పొట్లంలో నే నొక కొత్త మంత్రం రాసి ఉంచాను. దాన్ని వాడికి మీరు చేర్చగలిగితే నా పని తీరిపోతుంది. ఈ సహాయం చేయగలవాళ్ళు నా కిప్పు డెవరూ లేరు," అన్నాడు.

"ఆ పొట్లాన్ని నా కిస్తే నేను నీ కొడుక్కు చేర్చుతాను," అన్నాడు పాపన్న.

ముసలి బిచ్చగాడు ఆ చీకట్లో పాపన్న చేతిలో ఒక పొట్లం ఉంచాడు. ఒక పాత గుడ్డలో కట్టిన ఆ పొట్లం అరిచేతి అంత వెడల్పుగానూ, పలచగానూ ఉన్నది.

మర్నాడు పాపన్న కాళికాలయాన్ని వెతుక్కుంటూ వెళ్ళి, అక్కడ ఒక యువకుణ్ణి చూశాడు. వాడు ఒంటికంటివాడు. పాపన్న వాణ్ణి, "నీ పేరేనా వెంకడు?" అని అడిగి, వా డవునన్న మీదట, "నీ తండ్రి దీన్ని నీ కివ్వమన్నాడు," అంటూ పొట్లం

వాడి చేతిలో పెట్టి, "నీ తండ్రిని అధికారులు పట్టుకుపోయారు," అని చెప్పి దేవి దర్శనం చేసుకునేటందుకు ఆలయం లోపలికి వెళ్ళాడు.

ఆ దేవాలయంలో నలుగురే ఉంటారు. ఒకడు అర్చకుడూ, రెండోవాడు దేవాలయం నౌకరూ, మూడోవాడు వెంకడూ, నాలుగో వాడు వెంకడి సహచరుడూనూ. వెంకడు పొట్లం విప్పి, తన సహచరుడు తెచ్చిన గుడ్డపీలికను నీటితో తడిపే సరికి సాంకేతిక లిపిలో రాసి ఉన్నది ఏదో బయట పడింది. అందులో కొన్ని గీత లేవో ఉన్నాయి. అది గాక కొంత రాత కూడా ఉన్నది. ఆ రాతలో పాపన్నకు సంబంధించిన విషయా లిలా ఉన్నాయి: "ఇది తెచ్చేవాడే పరోపకారి పాపన్న. రాజుకు స్నేహపాత్రుడు. ఇతన్ని చెరలో పెట్టించు."

పాపన్న దేవాలయం నుంచి వెళ్ళిపోతున్నప్పుడు ఒంటికన్ను వెంకడు అతన్ని సమీపించి, "మీరు మా ఆతిథ్యం స్వీకరించాలి, పాపన్నగారూ. అమూల్యమైన సమాచారం తెచ్చినందుకు మీకు మా రాజుగారు గొప్ప బహుమానం ఇస్తారు. ఇవాళ రాత్రే మన ప్రయాణం," అన్నాడు. అత నా మాట అంటూండగానే అతని సహచరుడూ,



అర్చకుడూ వచ్చి పాపన్న చెరొక రెక్క పట్టుకున్నారు. "ఏమిటీ దౌర్జన్యం? నువ్వెవరు? ఆ బిచ్చగాడి కొడుకువు కావా?" అని పాపన్న అంటూండగా దేవాలయం నౌకరు పెద్ద తాడొకటి పట్టుకొచ్చాడు.

"ఇదంతా ఒక నాటకం. మీరు మాకు ఉపకారమే చేశారు గాని, మిమ్మల్ని బంధించక తప్పదు. మిమ్మల్ని విడిపించుకోవటానికి మీ రాజు మాకు అర్ధరాజ్యమిస్తాడో, రాజ్యమంతా ఇస్తాడో చూడాలి," అన్నాడు ఒంటి కన్నువాడు.

"అదా సంగతి? మీరు పూర్తిగా పొరబడ్డారు. నేను మీ రనుకున్నంత ముఖ్యుణ్ణి



కాను. నన్ను మీరు చంపినా మా రాజుగారు లెక్కచెయ్యరు. యుద్ధంలో చచ్చేవాళ్ళతో బాటే నేనూనూ. కావలిస్తే నన్ను చంపండి. కాని అందువల్ల మీ కింత పాపం తప్ప మరేమీ దక్కదు," అన్నాడు పాపన్న.

వాళ్ళు అతని చేతులు కలిపి కట్టి ఒక కొట్టులోకి నెట్టి తలుపులు మూసేశారు. గుడి ఉండే ప్రాంతం నిర్జనమైనది, తాను కేకలు పెట్టినా పలికే దిక్కుండదని పాపన్న గ్రహించాడు. గుడిలో వాళ్ళంతా శత్రువులూ, శత్రువుల మనుషులూనూ. ముసలి బిచ్చగాడు కూడా గూఢచారే. వాడు రాజధానికి సంబంధించిన రహస్య మార్గాలు మొదలైనవన్నీ చిత్రించి తన కొడుక్కు అందజేశాడు. ముసలివాడు పట్టుబడ్డాడు గాని ఒంటి కన్నువాడు స్వేచ్ఛగానే ఉన్నాడు. వాడా రహస్యాలను శత్రు రాజుకు చేర్చుతాడు.

పాపన్న అసాధారణ బలాఢ్యుడు కావటం చేత తన చేతికి కట్టిన తాళ్ళు వదిలించుకుని జరగగల దాని కెదురు చూస్తూ కొట్టులో ఉన్నాడు. ఆ రాత్రి ఒంటి కన్నువాడు యోధుడి వేషంలో, తన అను చరుడితో సహా వచ్చి, కొట్టు తలుపు తెరి పించి, పాపన్నను బయటికి రమ్మని, "ఇక మనం మా రాజుగారి దగ్గిరికి బయలుదేరు తున్నాం. పెద్దమనిషిలా మా వెంటరావాలి. దారిలో నువ్వేదైనా కోతి పని చేశావో మా కత్తులు రుచి చూస్తావు? వాటి రుచి నీకు తెలుసా?" అన్నాడు.

"నాకు తెలీదు. అసలు మీ చేతిలో కత్తు లుండటమే తప్పు," అంటూ పాపన్న ఒంటి కంటి వాడి చేతి మీద బలంగా ఒక్కటి పెట్టాడు. ఆ దెబ్బతో వాడి చేతి కత్తి కింద పడింది, చెయ్యి నీలుక్కుపోయి చచ్చే బాధ పెట్టింది. అది చూసి వాడి అను చరుడు పాపన్న పైకి తన కత్తి ఎత్తాడు. పాపన్న వాడి చేతి మీద కూడా బలంగా

కొట్టి, కత్తి కింద పడేయించాడు. తరవాత అతను రెండు కత్తులూ తీసి దూరంగా విసిరి పారేశాడు.

ఇంతలో అర్చకుడూ, నౌకరూ బలమైన తాళ్ళు తెచ్చారు. పాపన్న ఒంటికన్ను వాణ్ణీ, వాడి అనుచరుణ్ణీ చచ్చేటట్టు తన్ని, అర్చకుడు తెచ్చిన తాడు లాక్కుని, వాళ్ళిద్దరినీ పెడరెక్కలు విరిచి కట్టి, భయంతో కంపించిపోతున్న అర్చకుణ్ణీ, గుడి నౌకరునూ కూడా అలాగే కట్టి, నలుగురినీ గది లోకి తోసి, తలుపు బిగించాడు. తరవాత అతను గ్రామాధికారి ఇల్లు వెతుక్కుంటూ వెళ్ళి, తనకు నలుగురు గూఢచారులు చిక్కారనీ, వాళ్ళను పట్టుకుపోవటానికి భటులు కావాలనీ చెప్పాడు.

భటులు వచ్చి నలుగురినీ వశపరచుకున్నారు, ముసలి బిచ్చగాడు పంపిన సంకేత సందేశాన్నీ, ఇతర వస్తువులనూ స్వాధీనం చేసుకున్నారు. పాపన్న వాళ్ళ వెంట రాజధానికి వెళ్ళి, రాజుగారికి జరిగినదంతా సవిస్తరంగా చెప్పాడు.

రాజుగారు ఖైదీ బిచ్చగాళ్ళలో నుంచి ముసలి బిచ్చగాణ్ణి ఏరి, విచారించగా, వాడు శత్రురాజు పినతండ్రి అనీ, ఒంటి కన్ను వాడు ఆయన కొడుకే ననీ బయట పడింది. తరవాత రాజుగారు శత్రురాజుకు, "మీ పినతండ్రీ, ఆయన కొడుకూ మాకు బందీలుగా చిక్కారు. మీ సేనలు వెంటనే మా రాజ్యం వదిలి పోవాలి. యుద్ధ నష్టం కింద మీరు లక్షవరహాలు చెల్లించాలి. లేని పక్షంలో మీ పినతండ్రి తలా, ఆయన కొడుకు తలా తీయించి, మీతో యుద్ధం కొనసాగిస్తాం," అని కబురు చేశాడు.

తన వాళ్ళను విడిపించుకో గలందులకు శత్రురాజు షరతు లన్నిటికీ ఒప్పుకున్నాడు. దేశానికి యుద్ధభయం తీరిపోయింది. ఇతర యోధులతో బాటు పాపన్నకు కూడా రాజుగారు మంచి సన్మానం చేశాడు.





# తెల్లకుదేలు

జపాను దేశానికి కొంత దూరంలో కుందేళ్ళ దీవి ఉండేది. అక్కడ కుందేళ్ళు అసంఖ్యాకంగా ఉండేవి. ఆ దీవిలో వాటికి అన్ని రకాల సౌఖ్యాలూ అమర్చినట్టుగా ఉండేవి, ఏ ప్రాణి భయమూ ఉండేది కాదు. కుందేళ్ళ దీవిలో అన్ని రంగుల కుందేళ్ళూ ఉండేవి, కాని స్వచ్ఛమైన తెల్లకుందేలు ఒకే ఒకటి ఉండేది.

ఆ తెల్లకుందేలు రోజూ సముద్రం ఉత్తర తీరపు ఇసుకలో పడుకుని జపాను తీరం కేసి తదేక ధ్యానంగా చూస్తూ ఉండేది. జపాను తీరం దానికి ఆకాశం అంచున సన్నని గీరగా మాత్రమే కనబడేది. అయినా కుందేలుకు అక్కడికి వెళ్ళి, అక్కడి వింతలన్నీ చూడాలని గాఢమైన కోరిక ఉండేది. దాని బంధువులైన ఇతర కుందేళ్ళు, "ఎందు కెప్పుడూ ఇక్కడ ఇసకలో కూర్చుని సముద్రం మీదికి చూస్తావు?" అని అడిగితే తెల్ల కుందేలు, "ఆ కనపడేది అసలు దేశం. అక్కడ ఎన్నో వింత లుంటాయి. ఒక్కసారి ఆ దేశం వెళ్ళి ఆ వింతలు చూడాలని ఉంది," అనేది.

"నీ కేమన్నా మతిపోయిందా ఏమిటి? మన కోసం దేవు డీ లంకను సృష్టించి ఇచ్చాడు. ఇక్కడ మన కుండే సుఖం మరెక్కడా ఉండదు. ఇది మన సొంత గడ్డ. దీన్ని వదిలి పోవాలన్న బుద్ధి కలగటమే మహాపాపం!" అని మిగిలిన కుందేళ్ళు తెల్లకుందేలును మందలించాయి. అయినా దాని బుద్ధి మారలేదు.

తెల్లకుందేలుకు ఈ ఆలోచన కలగటానికి కారణం ఒక మొసలి. అది అప్పుడప్పుడూ జపాను తీరం నుంచి కుందేళ్ళ దీవికి వచ్చి అక్కడి ఇసుకలో విహరించేది. తెల్లకుందేలుకూ దానికీ మంచి స్నేహ

జపాను జానపద కథ



మయింది. జపాను తీరాన మురికి ఇసుక ఉంటుందనీ, అక్కడ మనుషు లనే ప్రాణు లుంటారనీ, వాళ్ళు నిటారుగా నిలబడి కింది కాళ్ళతో నడుస్తారనీ, పై కాళ్ళతో పనులు చేస్తారనీ, వాళ్ళకో చక్రవర్తి ఉంటాడనీ, ఆయన కొక కూతు రున్నదనీ, ఆమె జుట్టు అమావాస్య చీకటి లాగానూ, ఆమె శరీరచ్ఛాయ పౌర్ణమి వెన్నెల లాగానూ ఉంటుందనీ ఏవేవో కబుర్లు చెప్పేది. మొసలి చెప్పే కబుర్లు వింటున్న కొద్దీ కుందేలుకు, సముద్రం దాటి అక్కడికి వెళ్ళి ఆ వింతలన్నీ స్వయంగా చూడాలన్న కోరిక మరింత తీవ్రమయేది.

ఒకసారి మొసలి తెల్లకుందేలుతో, చక్రవర్తి కూతురిని పెళ్ళాడతామని ఎందరో గొప్ప గొప్ప యువకులు వస్తున్నారనీ, అమె వారి నెవరినీ పెళ్ళాడటానికి ఒప్పుకోలేదనీ చెప్పింది. ఇంకొక రోజు మొసలి సరికొత్త వార్త తెచ్చింది: దూర ప్రాంతం నుంచి అయిదుగురు రాజకుమారులు చక్రవర్తి కూతుర్ని పెళ్ళాడ గోరి వస్తున్నారట; వారిలో ఎవరినో ఒకరిని చక్రవర్తి కూతురు పెళ్ళాడవచ్చునని పుకారుగా ఉన్నదట.

తెల్లకుందేలుకు జపాను వెళ్ళాలన్న కోరికా, ఆ చక్రవర్తి కూతుర్ని ఒక్కసారి




చూడాలన్న కోరికా ప్రబల మయింది. అది తన స్నేహితు డైన మొసలితో, "అన్నా, నా కీ ప్రపంచంలో నువు తప్ప ఇంకెవరూ సహాయపడే వాళ్ళు లేరు. నన్ను నీ వీపు మీద ఎక్కించుకుని సముద్రం దాటించావంటే నీకు యావజ్జీవం రుణపడి ఉంటాను," అన్నది.

"నే నా పని చేశానంటే మీ బంధువు లంతా నాతో విరోధం కడతారు. నేను మీ తీరానికి వచ్చి మెత్తని, తెల్లని ఈ ఇసుకలో పడుకోవటానికి ఉండదు," అని మొదట మొసలి అభ్యంతరం చెప్పింది, కాని తెల్లకుందేలు ఆవేదన చూడలేక చివ



రకు సరేనని, దాన్ని తన వీపు పైన ఎక్కించుకుని జపాను తీరానికి చేర్చింది. ఆ తీరం నిండా గులకరాళ్ళూ, నల్లని మట్టీ ఉన్నాయి.

తెల్లకుందేలు తీరం నుంచి కొంత దూరం వచ్చే సరికి ఒక కుక్క దాని వెంటపడి పీకింది. ఎన్నడూ ఎరగని ప్రాణభయం తెల్లకుందేలుకు పట్టుకున్నది. కుక్క చేసిన గాయాలతో బాధపడుతూ, అది ఉప్పుటేరు దగ్గిరికి వచ్చింది. ఏటి మీదుగా ఒక వంతెన ఉన్నది. వంతెన కింద దట్టంగా తుంగ ఉన్నచోట తెల్లకుందేలు దాక్కుని, తాను తన స్వదేశాన్ని విడిచి వచ్చినందుకు పశ్చాత్తాప పడసాగింది. అంతా కొత్తలోకం. అపాయం ఎప్పుడు ఏ రూపంలో వచ్చిపడేదీ తెలీదు. తాను చక్రవర్తి కూతుర్ని చూసే ఆశ ఏమీ లేదు. తన స్నేహితుడైన మొసలిని కలుసుకుని తిరిగి తమ లంకకు పోవాలన్నా తేలిక పనిగా కనిపించలేదు. కుక్క తనను పీకినప్పుడు తెల్లకుందేలు గుడ్డిగా, కాలిసత్తువ కొద్దీ పరిగెత్తింది.

కొంత సేపటికి వంతెన మీద గుర్రాల డెక్కల చప్పుడయింది. కుందేలు వంతెన కింది నుంచి ఇవతలికి వచ్చి, మొట్టమొదటి సారి మనుషులను చూసింది. నలుగురు మనుషులు గుర్రా లెక్కి వస్తున్నారు. "చక్రవర్తి కుమార్తె ఇంటికి దగ్గిర దారి ఏదో?" అని వాళ్ళు తమలో తాము అనుకోవటం కుందేలు విన్నది. అన్నదమ్ములైన అయిదుగురు రాజకుమారులు చక్రవర్తి కూతుర్ని పెళ్ళాడగోరి వస్తున్నారని మొసలి చెప్పింది. వారిలో నలుగురు వీళ్ళయి ఉంటారని కుందేలు ఊహించింది. అది వాళ్ళను సమీపించి, తనను కూడా వాళ్ళ వెంట తీసుకుపొమ్మని బతిమాలింది.

"నీ గాయాలూ, నువ్వూనూ! నిన్ను తీసుకుపోతే చక్రవర్తి కూతురు ఎంతైనా సంతోషిస్తుంది!" అని రాజకుమారులు తెల్లకుందే



లును అవహేళన చేశారు. వారిలో ఒకడు తెల్లకుందేలును నీటిలో స్నానం చేసి, ఇసుకలో పొర్లమనీ, అలా చేస్తే గాయాలు మానుతాయనీ అన్నాడు.

నిజమే ననుకుని కుందేలు ఉప్పుటేరులో స్నానం చేసింది. ఉప్పునీరు తగలగానే దాని గాయాలు భగ్గున మంటపెట్టాయి. మంట తగ్గుతుందనే ఆశతో అది మురికి ఇసుకలో పొర్లింది. బాధ మరింత ఎక్కువ కావటమే కాక, తెల్లని పాలనురుగు లాటి దాని ఒళ్ళంతా మలినమైపోయి, అసహ్యంగా తయారయింది.

"ఛీ, పాడు మనుషులు! వీళ్ళకన్న కుక్కలే నయం," అనుకున్నది కుందేలు. దానికి స్వదేశానికి తిరిగిపోవాలన్న ఆదుర్దా రెట్టింపయింది. అది వంతెన దగ్గిరికి వచ్చి, కంటికీ మంటికీ ఏకధారగా ఏడవసాగింది.

ఇంతలో వంతెన మీదుగా మరొక మనిషి వచ్చాడు. నాలుగు పెద్ద పరుపుచుట్టలు వీపున మోసుకుని, వంగినడుస్తూ వచ్చే ఈ మనిషి ఏడుస్తున్న కుందేలును చూసి, తన వీపు మీది బరువు దించి, కుందేలును తన చేతుల్లోకి తీసుకుని, "అయ్యో, పాపం! ఇలా మట్టికొట్టుకుని ఏడుస్తున్నా వేమిటి? నీ కేం జరిగింది?" అని అడిగాడు.




ఈ మనిషి మంచివాడని కుందేలు వెంటనే గ్రహించి, తన కథ అంతా చెబుతూ, గుర్రాల మీద అటుగా వెళ్ళిన నలుగురు దుర్మార్గులూ చేసిన పని కూడా చెప్పింది. వాళ్ళు తన అన్నలే ననీ, తాను అయిదో రాజకుమారుణ్ణనీ అతను చెప్పాడు. వాళ్ళు నలుగురే చక్రవర్తి కూతుర్ని పెళ్ళాడ గోరి వచ్చారుట. ఇతను వాళ్ళ నౌకరుగా వచ్చాడుట.

"నువు మాత్రం చక్రవర్తి కూతుర్ని ఎందుకు పెళ్ళాడరాదు? ఆమె చాలా అందగత్తె అని నా స్నేహితుడు చెప్పగా విన్నాను," అన్నది కుందేలు.

అతను కుందేలును మంచినీటితో కడిగాడు. వెంటనే దాని బాధ ఉపశమించింది. తరవాత దాని గాయాల మీద తుంగ పుప్పొడి చల్లి అతను, "తెల్లకుందేలూ, నువ్విక్కడే పడుకుని కునుకు తియ్యి. నేను పరుపుచుట్టలు మా అన్నలకు చేర్చి, నిన్ను చక్రవర్తి కూతురు దగ్గిరికి తీసుకుపోతాను. నేను చేసిన వైద్యంతో ఈ లోపుగా నీకు గాయాల మీద మళ్ళీ బొచ్చు పెరుగుతుంది," అన్నాడు.

అతను తన అన్నల పరుపు చుట్టలు చేరవేసి తిరిగి వచ్చేసరికి తెల్లకుందేలు పంతెన వద్ద ఇంకా నిద్రపోతూనే ఉన్నది. అప్పటికి దాని గాయాల మీద బొచ్చు పూర్తిగా పెరిగిపోయింది. అయిదో రాజకుమాడురు కుందేలును ఎత్తుకుని చక్రవర్తి కుమార్తె అంతఃపురానికి చేరేసరికి, అతని అన్నలను చక్రవర్తి కుమార్తె నిరాకరించటం కూడా అయిందని తెలిసింది.

ద్వారపాలకులు వెళ్ళి చక్రవర్తి కూతురితో, మరొక రాజకుమారుడు ఆమెను పెళ్ళాడగోరి వచ్చాడనీ, అతని వెంట ఒక తెల్లకుందేలు కూడా ఉన్నదనీ చెప్పారు.

"తెల్లకుందేలా? అలాటిది ఉంటుందని ఎన్నడూ వినను కూడా లేదే. ఆ రాజకుమారుణ్ణి లోపలికి పంపండి," అన్నది రాజకుమార్తె.

ఆమె తెల్లకుందేలును ఎత్తుకుని, దాని ఒళ్ళంతా దువ్వి, "ఎంత అందంగా ఉంది," అని ముచ్చట పడింది. తెల్లకుందేలు ఆమెకు ఆ రాజకుమారుడు తనకు చేసిన మేలు గురించి చెప్పి, అతన్ని పెళ్ళాడమని సలహా ఇచ్చింది. చక్రవర్తి కూతురు ఒప్పుకున్నది. ఆమెకూ అయిదో రాజకుమారుడికీ వైభవంగా పెళ్ళి అయింది.

తెల్లకుందేలు తన దేశానికి తిరిగి పోలేదు. దాని జీవితమంతా చక్రవర్తి కుమార్తె వద్దనే గడిచిపోయింది.






# అనుకోని ఓటమి

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు మీది నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీవు పడుతున్న ఈ శ్రమ అంతా చివరకు వ్యర్థమైపోతే విచారించ నవసరం లేదు. ఎందుచేతనంటే, పూర్వం ఘూర్జర దేశపు రాజు తారాంగుడు ప్రయత్నం ప్రారంభించక పూర్వమే ఓడిపోయాడు. శ్రమ తెలియకుండా నీకా తారాంగుడి కథ చెబుతాను విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

ఘూర్జరదేశపు రాజుకు ఇద్దరు భార్యలుండేవారు. చాలా కాలం పాటు ఇద్దరికీ సంతు లేకుండా ఉండి, చివరకు చిన్న రాణి ఒక కొడుకును కన్నది. రాజ్యానికి యువరాజంటూ ఏర్పడినందుకు అందరూ సంతోషించారు. ఆ కుర్రవాడికి తారాంగుడని పేరుపెట్టి ఎంతో గారాబంగా పెంచసాగారు.

## బేతాళ కథలు



మరి అయిదేళ్ళ అనంతరం పెద్దరాణికి కూడా ఒక కొడుకు పుట్టాడు. వాడికి చంద్రాంగుడని పేరు పెట్టారు.

కుమారు లిద్దరూ పెరిగిరా సాగారు. చంద్రాంగుడు పట్టపురాణి కొడుకు, అందుచేత తండ్రి అనంతరం రాజయే అధికారం వాడికే ఉన్నదని పెద్దరాణి అంతఃపురంలో వాళ్ళ ఉద్దేశం. అందుచేత అక్కడి వాళ్ళంతా చంద్రాంగుణ్ణి "యువరాజా!" అని పిలిచే వాళ్ళు.

తారాంగుడు కావటానికి చిన్న రాణి కొడుకే అయినా రాజుగారి పెద్దకొడుకు గనక తండ్రి అనంతరం సింహాసనం మీద కూర్చునే హక్కు తారాంగుడికే ఉన్నదని, చిన్నరాణి అంతఃపురంలోని వాళ్ళంతా అతన్ని "యువరాజా!" అని పిలిచేవాళ్ళు.

రాజు మాత్రం తన కొడుకు లిద్దరినీ సమ భావంతోనే చూశాడు. వారిలో రాజ్యార్హత ఎవరిదన్న విషయం గురించి ఆయన ఆలోచించను కూడా లేదు. అది సమస్య అయి కూర్చున్నప్పు డాలోచించుకోవచ్చు లెమ్మనుకున్నాడు.

కొంత కాలానికి ఆ సమస్య రానే వచ్చింది. రాజుకు జబ్బు చేసింది. అవసాన కాలంలో ఆయన తన మంత్రిని పిలిచి, "నా కొడుకుల్లో ఎవడు రాజు కావటం న్యాయమో మీరే ఆలోచించి రాజ్యాభిషేకం చెయ్యండి," అని చెప్పి కన్ను మూశాడు.

రాజుగారికి ఉత్తరక్రియలు పూర్తిచేసి మంత్రి పురోహితుడు మొదలైనవారు న్యాయనిర్ణయం చెయ్యటానికి కూర్చున్నారు. వాళ్ళు ఎంతసేపు ఆలోచించినా రాజ్యార్హత ఎవరికి ఎక్కువ ఉన్నదీ తేల లేదు. చిన్నరాణికి మొట్టమొదట కొడుకు పుట్టాడు. తారాంగుడు పుట్టిన నాడే దేశ ప్రజలు తమకు యువరాజు ఏర్పడ్డాడనీ, భవిష్యత్తులో అతనే తమ రాజవుతాడనీ అనుకున్నారు. చంద్రాంగుడు "అన్నా"

అని పిలిచేవాడంటూ ఉండగా అతన్ని రాజు చెయ్యటం ఉచితం కూడా కాదు.

అయితే చంద్రాంగుడి తల్లి పట్టపురాణి. పట్టపురాణికి కొడుకుంటూండగా, సింహాసనం మీద కూర్చునే అధికారం లేని చిన్న రాణి కొడుకును తెచ్చి రాజును చెయ్యటం కూడా అంత భావ్యం కాదు. అలాటి నిర్ణయం రాజుగారు స్వయంగా చేసి ఉంటే లోకం సమ్మతించేదేమో, కాని యిప్పుడు మంత్రి పురోహితులు అలాటి నిర్ణయం చెయ్యకూడదు.

పోనీ ఇద్దరు రాణులూ రాజీపడి ఒక నిర్ణయానికి వస్తారేమో ననుకుంటే, తన కొడుకే రాజు కావాలని ఇద్దరూ మంచి పట్టుదలతో ఉన్నారు.

ఈ పరిస్థితిలో ఏ నిర్ణయమూ చెయ్యలేక మంత్రి, రాజ్యాన్ని రెండుగా చీల్చి, రెండు భాగాలకూ ఇద్దరు రాజకుమారులనూ అభిషేకింతామని సూచించాడు. అయితే ఇందుకు చంద్రాంగుడు సుతరామూ ఒప్పుకోలేదు. ఒక బలమైన రాజ్యాన్ని రెండు బలహీనమైన రాజ్యాలుగా చీల్చటం రాజనీతి గాదు. అందువల్ల దేశం యొక్క ఐక్యత దెబ్బ తింటుంది, కాలక్రమాన స్పర్థలూ, శత్రుభావమూ, యుద్ధాలూ మొదలైనవి ఏర్పడతాయి.





చివరకు తారాంగుడికే రాజ్యాభిషేకం నిశ్చయమయింది. చంద్రాంగుడు ఆ మహోత్సవపు అడావుడిలో ఎవరితోనూ చెప్పకుండా దేశం విడిచి వెళ్ళిపోయాడు. చంద్రాంగుడు తన శౌర్య ప్రతాపాలలో ఎంతో విశ్వాసం గలవాడు; వాటి సహాయం తోనే తా నొక రాజ్యం గెలుచుకుందామని అతని ఉద్దేశం.

తన కొడుక్కు రాజ్యప్రాప్తి లేకుండా పోయిందన్న దిగులుకు, ఆ కొడుకు కూడా కళ్ళ ఎదట లేకుండా ఎటో వెళ్ళిపోయాడన్న దిగులు తోడై, చంద్రాంగుడి తల్లి మంచం పట్టి కొన్నాళ్ళకు మరణించింది.

చంద్రాంగుడు సాధారణ క్షత్రియవీరుడి దుస్తులు ధరించి, గుర్రం మీద కొన్ని రోజులు దక్షిణ దిక్కుగా ప్రయాణం చేసి, కంకణమనే చిన్న రాజ్యాన్ని చేరుకున్నాడు. అతను రాజవీధిన వెళుతుండగా ఆ దేశపు రాజుకూతురు విద్యుల్లత ఏనుగు మీద దేవాలయానికి పోతూ అతనికి ఎదురయింది. ఆమె పేరుకు తగ్గట్టే అతిలోక సౌందర్యవతిగా కనిపించింది. ఆమెను చూడగానే చంద్రాంగుడి కళ్ళు జిగేలుమన్నాయి.

కంకణరాజుకు విద్యుల్లత ఒక్కతే కుమార్తె. ఆమెను పెళ్ళాడేవాడు కంకణ దేశానికి రాజుకూడా అవుతాడు. అందుచేత ఆమె తండ్రి ఆమెను ఒక గొప్ప వీరుడి కిచ్చి పెళ్ళిచెయ్యాలని తలపెట్టాడు. ఆయన వద్ద అన్నిరకాల యుద్ధవిద్యలలోనూ ఆరి తేరిన జెట్టీలున్నారు. త్వరలోనే విద్యుల్లతకు స్వయంవరం ఏర్పాటు కానున్నది. స్వయంవరానికి వచ్చే వారిలో ఎవరు అన్ని యుద్ధ విద్యలలోనూ రాజుగారి జెట్టీలతో నెగ్గితే వారికి విద్యుల్లత నిచ్చి పెళ్ళిచేస్తారు.

చంద్రాంగు డీ వార్త విని తన కోరికలు రెండూ ఒక్కసారిగానే సిద్ధింప జేసుకోవాలని నిశ్చయించుకున్నాడు. ఏదైనా ఒక రాజ్యం సంపాదించుకునే ఉద్దేశంతో అతను

ఇంటి నుంచి బయలుదేరాడు. కంకణ రాజధాని ప్రవేశిస్తూనే అతను విద్యుల్లతను చూసి, ఆమెను పెళ్ళాడని జన్మ నిరర్థక మనుకున్నాడు. స్వయంవరం నాడు తాను రాజుగారి జెట్టీలతో పోరాడి గెలిచినట్టయితే కోరిన భార్యా, రాజ్యమూ కూడా లభిస్తాయి. కంకణరాజ్యం చిన్నదే అయినా, దాన్ని చేతిలో ఉంచుకుని తాను తన శక్తితో పరిసర రాజ్యాలను గెలుచుకోవచ్చు నను కున్నాడు చంద్రాంగుడు. అతనొక పేద రాసి పెద్దమ్మ ఇంట బస ఏర్పాటు చేసు కుని విద్యుల్లత స్వయంవరం కోసం ఎదురుచూడసాగాడు.

కొద్ది రోజులకు స్వయంవరం రోజు రానే వచ్చింది. విద్యుల్లతను వరించి వచ్చిన రాజకుమారులకు ప్రత్యేకమైన బసలు ఏర్పాటై ఉన్నాయి. చంద్రాంగుడు కూడా అక్కడికి వెళ్ళాడు. తాను ఫలానా దేశపు రాజకుమారుణ్ణని చెప్పక, ఒక సుక్షత్రియకుమారుణ్ణని మాత్రమే చెప్పాడు.

విద్యుల్లతను పెళ్ళాడ గోరే వాళ్ళు రాజు గారి జెట్టీలను మల్లయుద్ధంలోనూ, గదా యుద్ధంలోనూ, విలువిద్యలోనూ, చివరకు కత్తి యుద్ధంలోనూ ఓడించాలి. జయాప జయాలు నిర్ణయించటానికి కొన్ని నియమాలున్నాయి.





వచ్చిన వారిలో ముప్పాతికమంది రాజుగారి మల్లుల చేతిలోనే ఓడిపోయి పరాభవం పొందారు. మల్లులను జయించిన వారిలో ఎక్కువమంది గదాయుద్ధంలో ఓడిపోయారు. చంద్రాంగుడు సామాన్య క్షత్రియుణ్ణని చెప్పుకోవటం చేత మిగిలిన రాజకుమారులందరూ పరీక్షలలో ఓడినాకగాని అతని వంతు రాలేదు. అతను గెలుస్తాడని రాజుగారు కలలో కూడా అనుకోలేదు. కాని ఒక్క గడియకాలంలో అతను నాలుగు రకాల యుద్ధవిద్యలలోనూ రాజుగారి జెట్టీలను ఓడించాడు. మల్లయుద్ధంలో చేతులు కలిపిన మరుక్షణమే రాజుగారి మల్లుడు మట్టికరిచాడు. అలాగే రాజుగారి జెట్టీచేతిలో నుంచి గద క్షణంలో ఎగిరిపోయింది. చంద్రాంగుడు తన మొదటి బాణం తోనే రాజుగారి విలుకాడి విల్లు విరిచాడు. రాజుగారి ఖడ్గయోధుడి కత్తి చంద్రాంగుడి కత్తికి తగులుతూనే రెండు ముక్కలయింది.

ఈ విధమైన యుద్ధపరీక్ష చూసి అందరూ కొయ్యబారిపోయి చూస్తూండగా విద్యుల్లత వరమాల చేతబట్టుకుని చంద్రాంగుణ్ణి సమీపించింది.

సరిగా ఆ క్షణంలో వాయువేగంతో రథం మీద తారాంగుడు వచ్చాడు. అతను కూడా స్వయంవరానికే వచ్చాడు. అయితే చంద్రాంగుడి తల్లి మరణం మూలంగా అతను అనుకున్నవేళకు బయలుదేరలేక, ఆమె దహన సంస్కారం అయాక బయలుదేరి, కొంచెం అలస్యంగా చేరాడు.

ఆ వచ్చినవాడు ఘూర్జర రాజనీ, అతను కూడా తన కుమార్తెను పెళ్ళాడాలనే వచ్చాడనీ తెలిసేసరికి కంకణరాజుకు పెద్దపెట్టున ఏడవాలనిపించింది. తాను ఏర్పాటు చేసిన కొద్దిపాటి పరీక్షలో ఎంతేసి రాజులూ ఓడిపోగా ఎవడో అనామకుడు గెలిచినందుకే ఆయన లోలోపల కుళ్ళిపోతున్నాడు. అలాటి పరిస్థితిలో ఘూర్జరరాజం

తటివాడు తనకు అల్లుడయే అదృష్టం ఒక్క ఘడియలో తప్పిపోయిందని తెలిసి అతడు ఎంతో ఆవేదన పొందాడు.

కాని అంత నిస్పృహలోనూ ఆయన కొక దురాలోచన మెరుపులాగా తలలోకి వచ్చింది.

"మహారాజా, దయ చెయ్యండి. దయ చెయ్యండి. పరీక్ష లింకా పూర్తికాలేదు. ఈ యువకు డిప్పుడే నా జెట్టీలను జయించాడు. తమరీ యువకుణ్ణి ఓడించినట్టయితే మీకే వరమాల లభిస్తుంది," అన్నాడు కంకణరాజు. తనకు అల్లుడు కాబోయేవాడు ఘూర్జరరాజు చేతిలో చస్తే బాగుండునని కంకణరాజు కోరిక.



తారాంగుడు ఒర నుంచి కత్తి దూసి చంద్రాంగుణ్ణి సమీపించాడు. అతను చంద్రాంగుణ్ణి గుర్తించలేదు, కాని చంద్రాంగుడు తన అన్నను గుర్తించి, తల వంచుకుని, తన చేతిలో ఉన్న కత్తి జారవిడిచాడు. విద్యుల్లత తన చేతిలోని వరమాలను చంద్రాంగుడి మెడలో వేసి, అతను కిందజార్చిన కత్తి తీసుకుని, "ఈయన నలుగురితో పోరాడి అలిసి ఉన్నారు. ఆ చేసే యుద్ధం నాతో చెయ్యండి," అన్నది.

చంద్రాంగుడు నిర్ఘాంతపోయి, తల ఎత్తి విద్యుల్లతనూ, తారాంగుణ్ణీ చూశాడు.

ఈ సారి తారాంగుడు చంద్రాంగుణ్ణి బాగా గుర్తించాడు. అతను తన కత్తిని తిరిగి ఒరలో పెట్టేసి, తన రథం ఎక్కి ఎవరితోనూ ఏమీ అనకుండానే వెళ్ళిపోయాడు.

విద్యుల్లత వరమాలను చంద్రాంగుడి మెడలో వేసింది గనక వారిద్దరికీ వివాహం చెయ్యక తప్పలేదు. తన కల్లుడైన వాడు సాక్షాత్తూ ఘూర్జరరాజు యొక్క పట్టపుదేవి గర్భవాసాన పుట్టినవాడే నని తెలిశాక కంకణరాజు దుఃఖమంతా పోయింది.

తారాంగుడు తన రాజధానికి తిరిగి వెళ్ళి మంత్రి మొదలైన వారితో, "నా కీ రాజ్యం అవసరం లేదు. నా తమ్ముడు కంకణ

దేశంలో ఉన్నాడు. అతనికే ఈ రాజ్యం కూడా ఇచ్చెయ్యండి," అన్నాడు.

ఆ విధంగా చంద్రాంగుడు ఘూర్జర దేశానికీ, కంకణ దేశానికీ కూడా రాజయ్యాడు. తారాంగుడు దేశాలుపట్టి పోయాడు. అతని జాడ ఎవరికీ తెలియదు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, నాకు కొన్ని సందేహాలున్నాయి. విద్యుల్లత ఘూర్జరరాణి అయే అవకాశాన్ని కూడా జార విడిచి తారాంగుడి కెదురుగా ఎందుకు కత్తిపట్టింది? వరమాల ఒక అనామకుడి మెడలో ఎందుకు వేసింది? విద్యుల్లతతో తారాంగుడు కత్తియుద్ధం చెయ్య నిరాకరించటం అర్థం చేసుకోవచ్చు, కాని తన తమ్ముణ్ణి జయించి ఆమెను సంపాదించటానికి మరొక విధంగా ఎందుకు యత్నించలేదు? పై పెచ్చు అతను తన కున్న రాజ్యాన్ని కూడా విడిచిపెట్టి ఎందుకు వెళ్ళిపోయాడు? ఈ సందేహాలకు సమాధానాలు తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "విద్యుల్లత నియమాలంటే గౌరవం గలది. తండ్రి నీచంగా తన నియమాన్ని తానే ఉల్లంఘించాలని చూశాడు. ఆమె దాన్ని వడగొట్టింది. ఇక తారాంగుడు దురభిమానం గల అశక్తుడు. ఘూర్జర రాజ్యాన్ని రెండుగా చీలుస్తా మన్నప్పుడు కూడా చంద్రాంగుడు అభ్యంతరం చెప్పాడే గాని తారాంగుడు అభ్యంతరం చెప్పలేదు. తాను కోరిన కన్యను తాను జయించలేక పోవటమే గాక, ఆమె ప్రతిఘటనను కూడా ఎదుర్కొన్నాడు. ఈ అవమానం లోకానికంతకూ తెలుస్తుందని అతను రాజ్యాన్ని కూడా వదిలి పారిపోయాడు," అన్నాడు.

రాజుకీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. —(కల్పితం)





# మతిలేని మాధవుడు

చంద్రనగరం శివారులో ఒక పేద విధవరాలుండేది. ఆమె నానా అగచాట్లూ పడి ఎలాగో జీవితం నెట్టుకొస్తూ ఉండేది. ఆమెకు మాధవు డని ఒక్కడే కొడుకుండే వాడు. అయితే వాడు వట్టి మందమతి, సోమరిపోతు. అందుచేత వాడు తల్లికి ఎందుకూ పనికిమాలినవాడై పోయాడు. వాడు ఇతర విధాల మంచివాడే; సాధువు, సద్భావాలు గలవాడు, సరదా అయినవాడు. అయినప్పటికీ వాడి విషయమై తల్లికి బెంగే తప్ప, సంతోషం ఉండేదికాదు. తల్లి వాడి కేదైనా పని చెబితే అదీ వాడి బుర్ర కెక్కేదికాదు; చెప్పిన మాట వినిపించుకో కుండా వాడి ఆనందంలో వాడు ఉండేవాడు. ఒకవేళ దారి తప్పి తల్లి చెప్పిన పని చెయ్యటం మొదలు పెడితే, పనంతా పాడు చేసేవాడు.

ఒకరోజు మాధవుణ్ణి తల్లి వంటచెరుకు కొట్టుకు రమ్మన్నది. మూడోసారి చెప్పిన మీదట వాడికి తల్లి మాట అర్థమయింది. అప్పుడు వాడు గొడ్డలి భుజాన పెట్టుకుని ఆడుతూ పాడుతూ అడవికి బయలుదేరాడు. అడవికి పోవాలంటే ఒక మైదానం మీది నుంచి పోవాలి. ఆ మైదానం మీద మాధవుడికి ముగ్గురు యువకులు ఎర్రని ఎండలో పడుకుని నిద్రపోతూ కనిపించారు.

పాపం, వాళ్ళు ఎండలో నిద్రపోతున్నారే అని జాలి కలిగి మాధవుడు ఆ మైదానంలోనే ఉన్న ఒక చెట్టు కొమ్మలు గబగబా నరికి తెచ్చి, నిద్రపోయే వాళ్ళకు నీడ వచ్చేటట్టు ఆ కొమ్మలను నేలలో పాతాడు. వాడా పని పూర్తిచేసి అడవి కేసి బయలుదేరబోతూండగా ఆ ముగ్గురు యువకులూ నిద్ర లేచి, "మాకు ఈ నీడ ఎందుకు ఏర్పాటు చేశావు?" అని అడిగారు.

"ఎండ జాస్తిగా ఉన్నది. సుఖంగా నిద్రపోతారుగదా అని," అన్నాడు మాధవుడు.

ఆర్. జగన్నాధరావు

"నువు చాలా మంచివాడివి. నువు కోరుకున్నదల్లా అవుతుందిలే పో!" అన్నారు వాళ్ళు. నిజానికి వాళ్ళకు అలాటి వరం ఇచ్చే శక్తి ఉన్నది, ఎందుకంటే వాళ్ళు దేవతాపురుషులు.

అయితే మాధవుడి మట్టి తలలోకి ఏదైనా కోరుకోవాలన్న ఆలోచన రానేలేదు. వాడా ముగ్గురికీ దణ్ణంపెట్టి, తిన్నగా అడవికి వెళ్ళి, వెర్రెత్తినట్టు అదేపనిగా కట్టెలు కొట్టసాగాడు. చివరకవన్నీ పోగేసి కట్ట కట్టేసరికి, ఆ మోపు వాడు మొయ్యగలదానికి నాలుగింతలయింది. దాన్ని వాడు ఒక్క అంగుళం కూడా ఎత్తలేక పోయాడు. ఏంచెయ్యటానికీ పాలుబోక వాడు ఆ మోపు మీద ఎక్కి కూర్చుని, "దీన్ని నే నింటికి మోసుకుపోలేను గనక ఈ మోపు నన్నింటికి మోసుకుపోతే ఎంత బాగుణ్ణు!" అనుకున్నాడు మనసులో.

వెంటనే ఆ మోపు గాలిలోకి లేచి, మాధవుణ్ణి మోసుకుని, అతి వేగంతో వాడి ఇంటి కేసి బయలుదేరింది. అది రాజవీధి కుండా పొయ్యేటప్పుడు రాజకుమార్తె ప్రభావతి, మాధవుణ్ణీ, వాడు సవారీ చేస్తున్న కట్టెల మోపునూ చూసి విరగబడి నవ్వింది. మాధవుడు తల పైకెత్తి, కిటికీ వద్ద నిలబడి తనని చూసి నవ్వే ప్రభావతిని చూసి,



"నన్ను చూసి నవ్వుతావా? నీకు మొగుణ్ణి అయినప్పుడు నీ సంగతి చెప్పకపోతానా?" అనుకున్నాడు. తాను ఏది కోరుకున్నా అది జరిగితీరుతుందన్న జ్ఞానం అప్పటికీ వాడికి లేదు.

అయినా ఆ శక్తి పని చేస్తూనే ఉన్నది. దాని మహిమ వల్ల రాజకుమార్తె ఆ క్షణం లోనే నవ్వటం మానేసి ఆ కిటికీ దగ్గిరే దిగులుగా, నిట్టూర్పులిచ్చుతూ ఉండి పోయింది. చెలికత్తెలు ఆమె దిగులుకు కారణం తెలుసుకోలేక, ఆ దిగులు పోగొట్టటం మొదలే చేతకాక, వెళ్ళి రాజుగారితో సంగతి చెప్పారు.

రాజు వచ్చి తన కుమార్తెను చూస్తూనే, "దిగులుగా ఉండకేం చేస్తుంది? దానికి పెళ్ళీడు వచ్చింది. పెందలాడే పెళ్ళి చేసెయ్యాలి," అనుకుని, పైకి, "అమ్మా, నీకు పెళ్ళి చేసేద్దా మనుకుంటున్నాను. రాజకుమారుల్లో నీకు నచ్చినవా డెవడైనా ఉంటే చెప్పు," అన్నాడు.

ప్రభావతి మరింత భారంగా నిట్టూర్చి, "ఇంతకు ముందు కట్టెల మోపు మీద సవారీ అయి ఇటుగా వెళ్ళిన అబ్బాయిని తప్ప నే నింకెవర్నీ పెళ్ళాడను," అన్నది.

తన కూతురి మాటలు రాజుకు అర్థం కాలేదు. ప్రభావతి చెలికత్తెలు వివరించి





చెప్పిన మీదట ఆయనకు కుమార్తె పైన ఆగ్రహం వచ్చింది. ప్రభావతి దారే వెళ్ళిన వాణ్ణి పెళ్ళాడతానన్నది గాని, వాడి పేరైనా ఆమెకు తెలీదు. ఇలాటి పరువుమాలిన ప్రేమలో పడినందుకు ప్రభావతిని తీవ్రంగా శిక్షించా లనుకున్నాడు రాజు. కాని మంత్రులు వారించి, "మహారాజా, మీకు కొడుకైనా, కూతురైనా ఆ బిడ్డ ఒక్కతే. ఆమె ప్రేమించిన యువకుడు మారు వేషంలో ఉన్న ఏ రాజకుమారుడో కావచ్చు. తొందరపడకండి," అన్నారు.

"వాణ్ణి ముందు పట్టుకోవాలి కద. ఏమిటి ఉపాయం?" అన్నాడు రాజు.

"నగరంలోని వివాహయోగ్యులైన యువకులందరినీ ఆహ్వానించి విందు ఏర్పాటు చెయ్యండి. వచ్చిన వారిలో తాను పెళ్ళాడ గోరినవాణ్ణి రాజకుమార్తె సులువుగా గుర్తు పట్టుతుంది," అన్నారు మంత్రులు.

రాజు సరేనని నగరంలో ఉండే ఉన్నత కుటుంబాలకు చెందిన పెళ్ళిగాని యువకు లందరికీ రాజభవనంలో విందు ఏర్పాటు చేసి, "వీరిలో నువు పెళ్ళాడ గోరినవా డెవడో చెప్పు," అని కుమార్తెతో అన్నాడు. ప్రభావతి అందరినీ కలయజూసి, "నేను పెళ్ళాడ గోరినవాడు వీరిలో లేడు," అన్నది.

రాజుకు తన కూతుర్ని చంపెయ్యా లన్నంత కోపం వచ్చింది. మంత్రులు మళ్ళీ అడ్డుపడి, "నగరంలోని మిగిలిన అవివా హిత యువకులందరికీ మరొక విందు చెయ్యండి. రాజకుమార్తె కోరుకున్న వాడు వారిలో ఉండవచ్చు," అన్నారు.

"అలగా వెధవనెవణ్ణో నా కూతురు పెళ్ళాడతానంటే నే నెలా సహిస్తాను?" అన్నాడు రాజు.

"అలాటిది సంభవిస్తే అది దైవయోగమే అవుతుంది, మహారాజా. దాన్ని కాదనటానికి మనమెవళ్ళం?" అన్నారు మంత్రులు.

రాజు మరొక విందు ఏర్పాటు చేయించి నగరంలోని బీదా సాదా కుటుంబాల యువకుల నందరినీ అధికారపూర్వకంగా ఆహ్వానించాడు. ఈ సంగతి మాధవుడు వినుకూడాలేదు. వాడి తల్లి విని విందుకు వెళ్ళమని ప్రోద్బలం చేసింది. వాడు వెళ్ళ నన్నాడు. "కమ్మని భోజనం పెడతార్రా! కడుపు నిండా తిని చక్కా్రరా!" అని తల్లి వాణ్ణి బలవంతాన విందుకు పంపింది. వాడు కట్టుకున్న చింపిరి బట్టల తోనే విందుకు వెళ్ళాడు.

కాని రాజకుమార్తె వాణ్ణి చూస్తూనే, "ఇడుగో నేను పెళ్ళాడ గోరినవాడు," అంటూ మాధవుణ్ణి చూపింది.

"ఈ బడుద్దాయినా నువు పెళ్ళాడ గోరేది?" అన్నాడు రాజు విస్మయంచెంది.

"అవును," అన్నది ప్రభావతి.

రాజుకు పట్టరాని కోపం వచ్చింది.

"సరే, నీ కంత పట్టుదలగా ఉంటే వాణ్ణే పెళ్ళాడు. ఆ తరవాత నేను చెయ్య వలిసిందేదో నేను చేస్తాను," అన్నాడు రాజు పళ్ళు కొరుకుతూ.

అప్పటి కప్పుడే పురోహితుడు వచ్చి ప్రభావతికీ, మాధవుడికీ పెళ్ళి చేసేశాడు. పెళ్ళితంతు ముగిసిన మరుక్షణం రాజు




నూతన దంపతులను ఒక పీపాలో పెట్టి మూత వేయించి, సముద్రం అటులో ఉండగా ఆ పీపాను దూరంగా సముద్రంలో పారేయించాడు. కెరటాలు ఆ పీపాను ఇంకా దూరంగా తీసుకుపోయాయి.

రాజకుమార్తెను పీపాలో బంధించమని రాజు ఇచ్చిన ఆజ్ఞ వింటూనే చెలికత్తెలు ప్రభావతి ఒడికి తినుబండారాల మూట ఒకటి కట్టారు.

పీపాలో కొట్టుకుపోతూ ప్రభావతి, "మనకు చావు తప్పదు. ఈ పీపాలో సందులు లేక పోతే ఊపిరాడక చస్తాం. సందు లుంటే సముద్రంలో మునిగి



చస్తాం. అలాగూ చావకపోతే, నా ఒడిలో ఉన్న తినుబండారా లన్నీ అయిపోయాక తిండికి మాడి చస్తాం," అంటూ పెద్ద పెట్టున ఏడవ నారంభించింది.

"అంతమాత్రాన ఏడవటం దేనికి? మనం ఇంకా బతికి ఉన్నాం గద," అన్నాడు మందమతి మాధవుడు.

"నీకు కొంచెం కూడా మెదడు లేదు. ఏ ఓడో వచ్చి రక్షించకపోతే ఎంత కాలం బతికి ఉంటాం?" అన్నది ప్రభావతి.

"నీకు ఓడ కావాలంటే ఎంతసేపు? నేను కోరుకుంటే క్షణంలో వస్తుంది. నేను కోరుకున్న దల్లా అవుతుందని ఆ రోజు ఆ ముగ్గురూ వరం ఇవ్వలా?" అన్నాడు మాధవుడు.

"అటువంటి వరం ఉంటే ఇంతసేపేం చేస్తున్నావు? ఒక పెద్ద ఓడ రావాలని వెంటనే కోరు," అన్నది ప్రభావతి.

"దానికి తొందరేముందీ? ముందు నీ తినుబండారాలు పైకి తియ్యి. వాటిని వృథా పోనివ్వటం దేనికి?" అన్నాడు మాధవుడు.

ఎప్పుడు పీపాలో నుంచి బయటపడ దామా అని ఆదుర్దాగా ఉన్న ప్రభావతి తన ఒడిలో మూటగట్టి ఉన్న తినుబండా రాలు గబగబా మాధవుడి చేత తినిపిం చింది. తినటం అయినాక మాధవుడు తాము పీపాలో నుంచి బయటపడాలనీ, తమ సమీపంలోకి ఒక పెద్ద ఓడ రావాలనీ, తమను తీరం చెర్చాలనీ కోరుకున్నాడు.

వెంటనే పీపా మీది మూత పెద్ద చప్పుడుతో ఎగిరిపోయింది. దంపతు లిద్దరూ బయటికి చూసేసరికి ఒక పెద్ద ఓడ కొద్ది గజాల దూరంలో కనబడింది. భార్యా భర్తలు ఆ ఓడ లోకి ఎక్కి ఒక చోట తీరాన్ని చేరారు.

ప్రభావతి ప్రోద్బలం చెయ్యగా మాధ వుడు సముద్ర తీరాన తన కొక పెద్ద రాజ

భవనమూ, దాని చుట్టూ తోటలూ, ఉద్యానవనాలూ, నౌకర్లూ, చాకర్లూ, పరివారమూ కావాలని కోరుకున్నాడు.

అక్కడ వాళ్ళు కొంత కాలం సుఖంగా ఉన్న తరవాత ప్రభావతి మాధవుడితో, "మనం ఇంకొక్క కోరిక కోరవలిసి ఉంది. నువు ఇలా ఉండటం బాగా లేదు; చూడటానికి అందంగానూ, మంచి తెలివిగానూ ఉండాలని కోరుకో," అన్నది.

"నేను అందంగా, తెలివిగా వుండటం అవసరమంటావా? నీక్కావాలంటే అలాగే కోరుతాను," అన్నాడు మాధవుడు.

ఈ కోరికతో మాధవుడు రూపంలోనే గాక, బుద్ధిలో కూడా పెద్ద మార్పు చెందాడు. ఇక అతనికి అడుగడుగునా భార్య ప్రోద్బలం అవసరం లేకపోయింది. తనకున్న శక్తితో అతను ఒక రాజ్యం సంపాదించుకుని, ప్రజల నందరినీ సుఖపెట్టటమే కాక, తన భవనంలో పనిచేసే నౌకర్లకు వీలయినమట్టుకు శరీరాయాసం కూడా లేకుండా చేశాడు.

ప్రభావతినీ ఆమె భర్తనూ సముద్రం లోకి తోయించిన తరవాత రాజు తన తొందరపాటుకు చాలా పశ్చాత్తాప పడ్డాడు. కొన్ని ఏళ్ళ అనంతరం ఆయన వేటకు వచ్చి, దూరాన ఒక కొత్త రాజభవనం ఉండటం గమనించి, అదెవరిదో కనుక్కుందామని వెళ్ళి, తన కుమార్తెను తిరిగి కలుసుకుని పరమానందం చెందాడు.

మాధవుడు తన తల్లిని తెప్పించుకుని ఆమెకు ఏ లోటూ లేకుండా అన్ని ఏర్పాట్లూ చేశాడు. ముసలితనం ఆమెకు సుఖంగా గడిచిన మాట నిజమే గాని, ఆ ఇంటి వాళ్ళు తన కొడుకూ, కోడలూ అని ఆమె నమ్మలేక పోయింది. అప్పుడప్పుడూ ఆమె తన కొడుకును తలచుకుని, "పిచ్చి వెధవ! ఏమైపోయాడో?" అని విచారపడేది.





# ఉత్తర కాండ

యముడితో యుద్ధానికి బయలుదేరిన రావణుడు యమలోకాన్ని చేరవచ్చి, అక్కడ నరకయాతన లనుభవిస్తున్న పాపకర్ములనూ, స్వర్గసుఖా లనుభవిస్తున్న పుణ్యకర్ములనూ చూశాడు. ఘోరాకారులూ, క్రూరులూ అయిన యమకింకరులు పాపులను పురుగుల చేత తినిపిస్తున్నారు, కుక్కల చేత కరిపిస్తున్నారు, వైతరణీ నదిలో ఈదిస్తున్నారు, కాలిన ఇసుక దిబ్బల మీద వేసి బాధిస్తున్నారు. నరక యాతన లనుభవించేవారు శవాల లాగా ఉండి, బాధతోనూ, దప్పికతోనూ అలమటిస్తున్నారు. మరొక వంక పుణ్యం చేసుకున్నవారు పుణ్యఫలాన్ని సమస్త సుఖాల రూపంలోనూ అనుభవిస్తున్నారు.

రావణుడు లక్షలాదిగా గల పాపులు అనుభవించే యాతనలను చూసి జాలిపడి, వారిని విడిపించ నారంభించాడు. అది చూసి యమదూతలకు కోపం వచ్చింది. వాళ్ళు రావణుడి పైకి వెళ్ళి, పరిఘలూ, శూలాలూ, ముసలాలూ, శక్తులూ, తోమరాలూ పుష్పకం మీదికి విసిరారు. కొందరు తేనెటీగల్లాగా పుష్పకం మీదికి ముసిరి, అందులోని ఆసనాలూ, వేదికలూ, మంటపాలూ విరిచి పారెయ్యసాగారు. అయితే అది అక్షయమైన విమానం కావటం చేత, వా రెంత నాశనం చేసినా ఎప్పటిలాగే చెక్కుచెదర కుండా ఉన్నది.

ఈలోపుగా నారదుడు తిన్నగా యముడి వద్దకు వెళ్ళాడు. యము డాయనను అర్ఘ్య





పాద్యాలతో సత్కరించి, క్షేమ మడిగి, వచ్చిన పని తెలుసుకో గోరాడు.

"యమరాజా, దశగ్రీవు డనే అజేయుడైన రాక్షసుడు నిన్ను జయించి, వశపరుచుకోవటానికి నీ పైకి యుద్ధానికి వస్తున్నాడు. నీ యమదండం ఏం కానున్నదో!" అన్నాడు నారదుడు. ఆయన అలా అంటుండగానే దూరాన వెలిగిపోతూ పుష్పకం కనబడింది.

రావణుడు యమకింకరులతో కొంత సేపు యుద్ధం చేసి, చివరకు వారి పైన పాసుపతాస్త్రం ప్రయోగించాడు. అది కార్చిచ్చు లాగా ఆ ప్రాంతాన ఉండే చెట్లనూ, పొదలనూ బూడిద చేస్తూ, తన జ్వాలలను అన్ని వైపులకూ వ్యాపింపజేసింది. యమదూతలు ఆ జ్వాలలో మిడతల్లాగా మాడిపోయారు. రావణుడూ, అతని మంత్రులూ దిక్కులు పిక్కటిల్లేటట్టు భయంకరమైన కేక పెట్టారు.

ఆ కేక విని యముడు, యుద్ధంలో రావణుడు జయించాడని గ్రహించి, తన సారథిని పిలిచి, తన రథాన్ని యుద్ధానికి ఆయత్తపరచ మన్నాడు. క్షణంలో ఎర్రని గుర్రాలు పూన్చిన రథం వచ్చింది. మృత్యుదేవత పాశాన్నీ, ముద్గరాన్నీ ధరించి, రథంలో యముడి ముందు నిలిచింది. యముడు రథంలో ఎక్కి కూర్చుంటే ఒక పక్కన కాలదండమూ, రెండో పక్క కాల పాశాలూ ఉన్నాయి. ఈ విధంగా యముడు యుద్ధానికి బయలుదేరే సరికి, మూడు లోకాలూ సంక్షోభం పొందాయి, దేవతలు కంపించారు.

మనోవేగం గల రథాశ్వాలు యముడి రథాన్ని క్షణంలో రావణుడి ముందుకు తెచ్చాయి. మృత్యుదేవతతో సహా అతి భయానకంగా ఉన్న యమరథాన్ని చూస్తూనే రావణుడి మంత్రులు భయవిభ్రాంతులై, నాలుగు దిక్కులకూ పారి





పోయారు. రావణుడు మాత్రం లేశమాత్రమైనా భయపడక, స్థిరంగా నిలబడ్డాడు.

ఇద్దరికీ ఏడు రాత్రుల పాటు మహా భయంకరమైన యుద్ధం జరిగింది. యముడు తాను ప్రయోగించిన అస్త్రాలతో రావణుణ్ణి మహా తీవ్రంగా గాయపరిచాడు, కాని రావణుడు ఓడిపోనూలేదు, రణరంగం నుంచి పారిపోనూ లేదు. మీదు మిక్కిలి అతను తన బాణాలతో యముణ్ణీ, మృత్యుదేవతనూ, సారథినీ కూడా ఎంతో నొప్పించాడు.

అది చూసి మృత్యువు యముడితో, "యమధర్మరాజా, ఈ రాక్షసుడితో నన్ను యుద్ధం చెయ్యనీ. వీణ్ణి క్షణంలో చంపేస్తాను. చంపటం నా హక్కు. నేను ఎందరో రాక్షసుల చావు చూశాను, ప్రళయకాలంలో లోకాలకు లోకాలే నాశనం కావటం చూశాను. ఇత డనగా ఎంత?" అన్నది.

"నువు ఊరికే చూస్తూ ఉండు. వీణ్ణి నేనే చంపుతాను," అంటూ యముడు కాలదండాన్ని పట్టి ఎత్తాడు. అది మంటలు కక్కుతూ మహా భయంకరంగా కనబడింది. యముడు దాన్ని రావణుడి పైకి విసరబోతూ వుండగా బ్రహ్మ ప్రత్యక్షమై, "యమధర్మరాజా, దాన్ని ప్రయోగించకు. దీనితో రావణుడు చచ్చినట్టయితే నేను వీడి కిచ్చిన వరం అబద్ధమవుతుంది. వాడు చావనట్టయితే ఈ కాలదండాన్ని నేను సృష్టించిన ఉద్దేశం అబద్ధమవుతుంది. మృత్యువుతో బాటు నేనీ దండాన్ని అమోఘంగా ఉండే లాగు పూర్వం సృష్టించాను. అందుచేత, కాలదండాన్ని రావణుడి పైన ప్రయోగించావంటే, ఒక విధంగా కాకపోతే మరొక విధంగా నా మాట వ్యర్థమై పోతుంది," అన్నాడు.

బ్రహ్మ మాట మన్నించి యముడు కాలదండాన్ని అవతల పెట్టేశాడు. రావణాసురుణ్ణి చంపటానికి తనకు అవకాశం లేని

పక్షంలో తాను యుద్ధరంగంలో ఏం చెయ్యాలో తెలియక, యముడు తన రథంతో సహా అంతర్థానమై బ్రహ్మతో స్వర్గానికి వెళ్ళిపోయాడు.

రావణుడు తాను యముణ్ణి జయించానని ప్రకటన చేసి పుష్పకంలో యమపురం వెళ్ళిపోయాడు. ఇదంతా కళ్ళారా చూసిన నారదుడు పరమానందం చెందాడు.

యముణ్ణి జయించి, మారీచుడు మొదలైన మంత్రుల చేత ప్రశంస లందుకుని, రావణుడు పుష్పకంలో పాతాళ లోకానికి బయలుదేరి, వరుణుడి పరిపాలనలో ఉన్న సముద్రంలో ప్రవేశించి, వాసుకి మొదలైన నాగు లుండే భోగవతీ నగరాన్ని స్వాధీనం చేసుకుని, నివాతకవచు లుండే మణిమతి అనే నగరానికి వెళ్ళాడు. రకరకాల ఆయుధాలు కలిగి, అజేయులైన నివాతకవచులు రావణుడితో యుద్ధానికి తలపడ్డారు.

ఒక్క సంవత్సరం పాటు యుద్ధం సాగినా జయాపజయాలు తేలలేదు. అప్పుడు బ్రహ్మ విమానం మీద అక్కడికి వచ్చి, ఉభయ పక్షాలకూ సంధి చేసి, అగ్నిసాక్షిగా వారి మధ్య స్నేహం నెలకొల్పి వెళ్ళిపోయాడు. రావణుడు నివాతకవచులకు ఏడాది పాటు అతిథిగా ఉండి, తన సొంత



నగరంలో ఉన్నట్టే సుఖంగా కాలం పుచ్చి, నివాతకవచుల వద్ద తనకు తెలియని మాయలు తొంభైతొమ్మిది నేర్చుకుని, వరుణు డుండే నగరాన్ని వెతుకుతూ బయలుదేరాడు.

దారిలో అతనికి కాలకేయు లుండే అశ్మనగరం తగిలింది. అక్కడ రావణుడికీ కాలకేయులకూ యుద్ధ మయింది. రావణుడు కాలకేయ వీరులను చాలా మందిని చంపాడు. అలా చచ్చిన వారిలో విద్యుజ్జిహ్వు డనేవాడు, శూర్పణఖ భర్త కూడా ఉన్నాడు. వాడు బలగర్వితుడు, మెరపు లాగా తన నాలుకను చాచి రాక్షసు



లను నాకేశేవాడు. రావణుడు వాణ్ణి కత్తితో నరికి చంపాడు. మొత్తం మీద నాలుగు వందల మంది కాలకేయ వీరులు రావణుడి చేతిలో చచ్చారు.

అక్కడి నుంచి బయలుదేరి రావణుడు వరుణుడి మందిరానికి వచ్చాడు. ఆ భవనం తెల్లని మబ్బు లాగానూ, కైలాసం లాగానూ ఉంది. అక్కడ అనుక్షణమూ పాలధారలు స్రవించే సురభి అనే కామధేనువు రావణుడికి కనబడింది. దాని పాలతోనే పాల సముద్రం ఏర్పడింది. ఆ పాలసముద్రం నుంచి చంద్రుడు పుట్టాడు, అమృతం పుట్టింది. పాలసముద్రపు నురుగు తిని



కొందరు మహర్షులు జీవిస్తారు. శివుడికి వాహనమైన నంది కామధేనువుకు పుట్టినదే.

అలాటి కామధేనువుకు రావణుడు ప్రదక్షిణం చేసి, వరుణ మందిరాన్ని సమీపించాడు. వరుణుడి యోధులు రావణుడితో యుద్ధం చేశారు. రావణుడు వారి నాయకులను చంపి, యోధులతో, "రావణుడు యుద్ధం చెయ్య వచ్చాడని వరుణుడితో చెప్పండి," అన్నాడు.

వరుణుడి కొడుకులూ, మనమలూ తమ పరివారాలతో సహా రథా లెక్కి రావణుడి పైకి వచ్చి, ఒక్క తృటిలో రావణుడి చేతిలోనూ, అతని మంత్రుల చేతిలోనూ ఓడిపోయారు. తమ పరివారం నశించాక వరుణ పుత్రులు వీరోచితంగా పోరాడి, తాము కూడా దెబ్బతిన్నారు. తరవాత రావణుడు వరుణుడికి కబురు చెయ్యగా, వరుణుడు ఇంట లేడనీ, ఆయన సంగీతం వినటానికి బ్రహ్మలోకానికి వెళ్ళాడనీ తెలిసింది.

రావణుడు తాను గెలిచినట్టు ప్రకటన చేసి, పుష్పకం మీద ఎక్కి తిరిగి అశ్మనగరానికి వచ్చాడు. అక్కడ అతను మదగర్వితుడై విహరిస్తూండగా అతని కొక అద్భుతమైన భవనం కనబడింది. దానికి అలంకారాలుగా వైడూర్య తోరణాలూ,





ముత్యాల జాలరులూ, బంగారు స్తంభాలూ, స్ఫటిక సోపానాలూ మొదలైనవి ఉన్నాయి. రావణుడు ప్రహస్తుడితో, "ఇంత అందమైన ఇల్లెవరిదో కనుక్కొనిరా," అన్నాడు.

ప్రహస్తుడు మొదటి ప్రాకారం దాటి లోపలికి వెళితే ఎవరూ కనిపించలేదు. అతను అలాగే ఏడు ప్రాకారాలూ దాటి లోపలికి వెళ్ళేసరికి లోపల ఒక జ్వాల కనిపించింది. దాని మధ్య ఒక దివ్య పురుషు డున్నాడు. ఆయన సూర్యుడి లాగా వెలిగిపోతూ తేరి చూడరాకుండా ఉన్నాడు. ఆ మహాపురుషుడు ప్రహస్తుణ్ణి చూడగానే సంతోషంతో నవ్వాడు. ఆ నవ్వు విని ప్రహస్తుడి శరీరం పులకరించింది. అతను వెంటనే రావణుడి దగ్గిరికి తిరిగి వచ్చి, తాను చూసినదంతా తెలిపాడు.

సంగతి వింటూనే రావణుడు పుష్పకం నుంచి దిగి, ఆ భవనంలోకి ప్రవేశించబోయే సరికి ద్వారాన్ని పూర్తిగా ఆక్రమించి ఒక భయంకరాకారుడు ఎదురుపడ్డాడు. ఆ ఆకారం నెత్తిన చంద్రుడు డున్నాడు, నోట భయంకరమైన జ్వాలలు వెలువడుతున్నాయి, కళ్ళూ, పెదవులూ ఎర్రగానూ, ముఖం తెల్లగానూ ఉన్నాయి, జుట్టు పైకి లేచి ఉన్నది, దట్టమైన మీసాలూ, గడ్డమూ,



పెద్ద పెద్ద కోర లున్నాయి, చేతిలో పెద్ద ముద్గర మున్నది. ఆ భయంకరాకారాన్ని చూడగానే రావణుడి శరీర మంతా జలదరించింది. ఆ ఆకారం రావణుణ్ణి చూసి, "రాక్షసుడా, భయపడకు. నీ కోరిక ఏమిటో చెప్పు," అని అడిగింది.

"నాకు యుద్ధం కావాలి," అన్నాడు రావణుడు.

"ఎవరితో యుద్ధం చేస్తావు? నాతోనా? బలితోనా?" అని ఆకారం అడిగింది.

"ఈ ఇల్లెవరిదో వారితో చేస్తాను? లేదా, నువ్వెవరితో చెయ్యమంటే వారితోనే చేస్తాను," అన్నాడు రావణుడు.

"బలి లోపల ఉన్నాడు. కావలిస్తే ఆ మహామహుడితో నిరభ్యంతరంగా యుద్ధం చెయ్యి," అన్నది ఆకారం.

రావణుడు లోపలికి వెళ్ళి, సూర్యుడి లాగా వెలిగిపోతున్న బలిని తేరి చూడలేక పోయాడు. బలి రావణుణ్ణి తేలికగా ఎత్తి తన తొడ మీద కూర్చోబెట్టుకుని, "ఏం పని మీద వచ్చావు, బాబూ? నీ కోరిక ఏమిటో తెలిపితే నేను తీర్చుతాను," అన్నాడు.

"మరేం లేదు, మహానుభావా! నిన్ను పూర్వం విష్ణువు మోసం చేసి నిర్బంధంలో ఉంచాడన్నారు. నిన్ను విడిపించే శక్తి నాకున్నది. అందుచేత ఆ పని చేసి పోదామని వచ్చాను," అన్నాడు రావణుడు.

"అదా సంగతి? అయితే నీ కొక్క చిన్న విషయం చెప్పాలి. అక్కడ పడి ఉన్న కుండలాన్ని ఒక్కసారి పట్టుకురా," అన్నాడు బలి. రావణుడు దగ్గిరికి వెళ్ళి చూస్తే ఆ కుండలం ఒక పెద్ద చక్రమంత ప్రమాణంలో ఉన్నది. రావణుడు సునాయాసంగా దాన్ని ఎత్తబోయి పరాభవం పొందాడు. అది కదలలేదు. రావణుడు తన రెండు చేతులతోనూ, బలమంతా ఉపయోగించి కూడా దాన్ని ఏమాత్రం కదల్చలేక పోయాడు.

అది చూసి బలి రావణుణ్ణి దగ్గిరికి పిలిచి, "నువు కదల్చలేక పోయిన ఆ కుండలం మా పూర్వీకుడైన హిరణ్యకశిపుడు చెవికి పెట్టుకున్నటువంటిది. ఆయన ఎవరివల్లా చావు లేకుండా వరాలు పొంది చివరకు నరసింహరూపం దాల్చిన విష్ణువు చేతిలోనే చచ్చిపోయాడు. ఆ విష్ణువునే నువ్వు ద్వారం వద్ద చూశావు. ఆయన ఎప్పుడూ అక్కడే ఉంటూ ఉంటాడు," అన్నాడు.

ఈ మాటలు విని రావణుడు క్రోధంతో ద్వారం వద్దకు వచ్చాడు. కాని అతనికక్కడ ఎవరూ కనిపించ లేదు.






బ్రహ్మ వల్ల వరాలు పొంది తారకాసురుడు మూడు లోకాలనూ సంక్షోభ పెడుతు న్నప్పుడు, శివుడికి పుట్టినవాడి చేత తప్ప తారకాసురుడు చావడని తెలిసి, ఇంద్రుడు మన్మధుడికి వసంతుణ్ణి తోడిచ్చి, శివుడికి పార్వతి పైన మోహం పుట్టించమని పంపాడు. తపస్సు చేసుకుంటున్న శివుడి సమీపంలో పార్వతి ఉండగా మన్మధుడు వెళ్ళి, తన పుష్పబాణాలతో కొట్టి, తపో భంగం కలిగించాడు.

శివుడు ఆగ్రహించి తన మూడో కన్ను తెరిచేసరికి, అందులో నుంచి వెలువడిన అగ్ని జ్వాలలు మన్మధుణ్ణి నిలువునా భస్మం చేశాయి.

మన్మధుణ్ణి భస్మం చెయ్యగా మిగిలిన అగ్ని సముద్రంలో పడి ఒక పిల్లవాడి రూపం పొందింది. ఆ పిల్లవాడు ఏడ్చే సరికి దేవత లందరూ బెదిరిపోయి బ్రహ్మ దగ్గిరికి పరిగెత్తారు. బ్రహ్మ వారిని వెంటబెట్టుకుని సముద్రుడి వద్దకు వచ్చి, "ఏమిటీ రొద?" అని అడిగాడు.

సముద్రుడు బ్రహ్మకు తన శిశువును చూపించి, "వీడు నా కొడుకు. వీడికి నామకరణం చేసి, జాతకం చెప్పండి," అని కోరాడు.

బ్రహ్మ ఆ శిశువుకు జలంధరుడని పేరు పెట్టి, "వీడికి శివుడి వల్ల తప్ప మరెవరి వల్లా భయం లేదు," అని చెప్పి దేవతలతో అంతర్ధాన మయాడు.

జలంధరుడు పెరిగి పెద్దవా డయాడు. పెళ్ళి యీడు వచ్చింది. సముద్రుడికి మిత్రుడైన కాలనేమికి వృంద అనే కుమార్తె ఉన్నది. సముద్రుడు కాలనేమితో మాట్లాడి వృందను జలంధరుడికి చేసుకున్నాడు.

ఒకనాడు జలంధరుడి సభకు రాక్షస గురువైన శుక్రాచార్లు వచ్చాడు. మాటల

అట్ట చివరి బొమ్మ



సంపద అంతా తన కిచ్చెయ్యమని ఘస్మరు డనే దూతను పంపి అడిగించాడు. ఇంద్రుడు జలంధరుడి దూతను లక్ష్య పెట్టక, "మా తమ్ముడైన విష్ణువు నీ వంటి రాక్షసులను ఎందరినో చంపాడు. నీ వెంత?" అని జవాబు పంపాడు.

జలంధరుడు దేవతల పైకి యుద్ధ సన్నద్ధుడై వచ్చాడు. జలంధరుడితో యుద్ధం చెయ్యటానికి దేవతలు విష్ణుమూర్తిని తెచ్చారు. విష్ణుమూర్తి జలంధరుడితో ఎంత సేపు యుద్ధం చేసి కూడా జయించలేక, ఓటమి అంగీకరించి, లక్ష్మి సహితుడై జలంధరుడి ఇంట నివసించటానికి సమ్మతించాడు. విష్ణువే ఓడిపోయేసరికి దేవతల పక్షాన జలంధరుడితో యుద్ధం చేసేవాళ్ళు లేకపోయారు. వాళ్ళు తమ దుస్థితిని గురించి నారదుడితో మొరపెట్టుకున్నారు. అప్పుడు నారదుడు జలంధరుణ్ణి కడతేర్చే ఉపాయం తాను చేస్తానని దేవతలకు మాట ఇచ్చాడు.

తరవాత నారదుడు జలంధరుడి వద్దకు వెళ్ళి, "జలంధరా ఏమి నీ సంపద! ఉత్తమమైన ఇళ్ళూ, గుర్రాలూ, ఏనుగులూ సమస్తమూ ఉన్నాయి, కాని లోకోత్తరురాలైన భార్యే లేదు. స్త్రీలలో కెల్లా ఉత్తము

సందర్భాన శుక్రాచార్లు జలంధరుడితో దేవతలు రాక్షసులకు చేసిన అన్యాయం గురించి చెబుతూ, "పూర్వం సముద్ర మథనం జరిగినప్పుడు అందులో నుంచి అమృతం కాక, అంతులేని మణులూ, రత్నాలూ వెలువడ్డాయి. అన్నిటినీ దేవతలే కాజేశారు. సముద్రుడికి ఏమీ ఇచ్చారు కారు. అలాగే అమృతం కూడా రాక్షసులకు పాలివ్వకుండా తామే లాక్కున్నారు. అమృతం తాగినందుకు వాళ్ళు రాహువు తల నరికేశారు," అని చెప్పాడు.

ఈ పాత కథ విని జలంధరుడికి కోపం వచ్చింది. సముద్రం నుంచి కాజేసిన

రాలు పార్వతి. అలాటిది శ్మశానాలలో తిరిగే శివుడి పాలిట పడింది. శివుడికి పార్వతిలాటి భార్య ఎందుకు? నీవే వెళ్ళి ఆమెను తెచ్చుకో. పరాక్రమశాలివైన నిన్నె వరు అడ్డగలరు?" అన్నాడు.

నారదుడి మాటలు నమ్మి అవివేకి అయిన జలంధరుడు, పార్వతిని తన కిచ్చెయ్యమని శివుడికి కబురు చేశాడు. వెంటనే శివుడు జలంధరుడి మీదికి యుద్ధానికి వచ్చాడు.

శైవగణాలకూ, రాక్షసులకూ మహా భయంకరంగా యుద్ధం సాగింది.

ఆ సమయంలో జలంధరుడి కొక దుర్బుద్ధి పుట్టింది. అతను శివుడి రూపం ధరించి, కొందరు రాక్షసుల చేత ప్రమథుల రూపం ధరింపజేసి, పార్వతి ఉండే చోటికి వెళ్ళి, "శివుడు నీ కోసం వచ్చాడు," అని పార్వతితో చెప్పటానికి తన అనుచరుణ్ణి ఒకణ్ణి పంపాడు. వాడు పార్వతి ఎదటికి వెళ్ళి, కొయ్యబారిపోయాడు.

అది చూసి పార్వతి మోసం శంకించి, తా నున్న చోటి నుంచి పారిపోయి, విష్ణువును తలుచుకున్నది. విష్ణువు ప్రత్యక్షమై, "ఏమి కోరి నన్ను రప్పించావు?" అని పార్వతిని అడిగాడు.



"జలంధరుడి భార్య అయిన వృంద పాతివ్రత్యాన్ని నీవు భగ్నం చెయ్యాలి. ఆ పాతివ్రత్య బలంతోనే వాడు అజేయుడుగా ఉన్నాడు," అన్నది పార్వతి.

ఈ సమయంలో వృందకు ఒక పీడకల వచ్చింది. జలంధరుడు ఒక దున్నపోతు నెక్కి దక్షిణంగా పోతున్నట్టూ, జలంధరుడి నగరం తగలబడుతున్నట్టూ ఆమె కల గని, కంగారుపడి, వెర్రిదాని లాగా వనంలో తిరగసాగింది. ఆమె అలా తిరుగుతూండగా ఒక చెట్టు కింద విష్ణుమూర్తి వృద్ధ మునీశ్వరుడి రూపంలో ఆమెకు కనిపించాడు. చెట్టు పైన రెండు కోతులున్నాయి.

వృంద అతన్ని చూసి, "మునీశ్వరా, తమరు దివ్యదృష్టితో చూసి, నా భర్త బతికి ఉన్నాడో లేదో చెప్పండి," అని వేడుకున్నది.

"నీ భర్త అయిన జలంధరుడు శివుడి చేతిలో చచ్చాడు," అన్నాడు మాయా ముని రూపంలో ఉన్న విష్ణువు.

వృంద ఆ మాట వింటూనే అమితంగా కలవరపడిపోయి, "స్వామీ, ఎలాగైనా నా భర్తను తిరిగి బతికించండి," అని ఆ మునిని ప్రార్థించింది.

"నా తపశ్శక్తి చేత నీ భర్త ఇప్పుడే బతికి వచ్చేటట్టు చేస్తాను," అని విష్ణుమూర్తి, సమీపంలో ఉన్న కొలనులో మునిగి, జలంధరుడి రూపం ధరించి, వృంద వద్దకు వచ్చాడు. వృంద ఆ మోసాన్ని గ్రహించలేక, తన భర్తే వచ్చాడనుకుని, విష్ణుమూర్తిని కౌగలించుకుని, తన పాతివ్రత్యాన్ని కోల్పోయింది.

ఆ తరవాత వృందకు మోసం తెలిసింది. ఆమె విష్ణువును శపించుతూ, "ఇలాటి పని చేసినందుకు నువు కూడా భార్యా వియోగం పొంది, కోతులను వెంటవేసుకుని తిరుగు," అని, చితి పేర్చుకుని, అందులో కాలి బూడిద అయిపోయింది.

విష్ణుమూర్తి అక్కడే స్తంభించి నిలబడిపోయాడు.

వృంద పాతివ్రత్యానికి భంగం కలగటం చేత జలంధరుడికి రక్ష లేకుండా పోయింది. ఆ దుర్మార్గుడు పార్వతిని మోసం చెయ్యయత్నించినట్టు తెలిసి, శివుడు ఆగ్రహావేశంతో భయంకరంగా పోరాడి, జలంధరుణ్ణి హతమార్చాడు.

తరవాత శివుడూ, పార్వతీ విష్ణుమూర్తి నిలబడి ఉన్న చోటికి వచ్చారు. వృంద బూడిద అయిన చోట వారు విత్తనాలు చల్లగా అక్కడ తులసి మొక్కా, ఉసిరి మొక్కా, మాలతి మొక్కా మొలిచాయి.



# 49. ప్వే శిఖరం

ప్వే (ఫ్రాన్సు) నగరపు శివార్లలో గల ఈ కొండ ఒకప్పుడు అగ్నిపర్వత ముఖంలో ఉండేది. మిగిలిన మృదుశిల అంతా అరిగి, కరిగిపోగా ఇది నిలిచిపోయింది. సుమారు వెయ్యేళ్ళ క్రితం దీని పై భాగాన, 289 అడుగుల ఎత్తున, ఈ విచిత్రమైన ప్రార్థనామందిరం నిర్మించారు. దీనికి 268 మెట్లు ఉన్నాయి.



Photo by Prabhakar Mahadik



బహుమతి
పొందిన వ్యాఖ్య

నెమలి ఫించపు కన్నుల జిలుగులు

పంపినవారు:
వి. కృష్ణకుమారి, బాపట్ల

Photo by B. Bhansali



బహుమతి
పొందిన వ్యాఖ్య

కోమలి క్రొంజెడ మల్లెల వెలుగులు

పంపినవారు :
వి. కృష్ణకుమారి, బాపట్ల

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1966 ఫిబ్రవరి నెల సంచికలో ప్రకటించబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ డిశెంబర్ నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:–చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

## డిశెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : నెమలి ఫించపు కన్నుల జిలుగులు

రెండవ ఫోటో : కోమలి క్రొంజెడ మల్లెల వెలుగులు

పంపినవారు : వి. కృష్ణకుమారి, C/o శ్రీ వి. సుబ్బరామారావు, బాపట్ల. (గుంటూరు జిల్లా)

బహుమతి మొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. NAGI REDDI at The B. N. K. Press Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

# దిలీపు బృందం




## తిరణాళ్ల ముచ్చట



ఇదంతా ఎంత అందంగా వుందో!

పెద్దచక్రం దగ్గరకు వెళ్దాంపద!

దాన్ని చూస్తేనే నాకు భయంవేస్తోందిరా!

నాకుమాత్రం భలే తమాషాగా వుందిలే!

మాకందరికీ తలో లాలీపాప్ ఇప్పిస్తే రంగుల రాట్నం ఎక్కుతాం!

నా తెల్ల గుర్రాన్ని చూడు!

మనం చాలా జోరుగా తిరుగుతునాం కదూ!

అరె, దీపాలారి పోయాయే!

నాకేం కనపడ్డంలేదు!

నన్నెవరో తోసేస్తున్నారు!

మన 'ఎవరెడి' టార్చి పైకి తీసేదాకా గట్టిగా పట్టుకోండి.

ఇప్పుడు నాతో రండి! గేటుదగ్గరకు త్వరగా చేరుకోవాలి!

ఎలాగైతేనేం, బయటపడ్డాం!

తిరణాళ్లు

నిజంగా, మన 'ఎవరెడి' టార్చి చీకట్లోంచి వెలుతురులోకి తీసుకొచ్చి తోడ్పడింది!

